శ్రీరస్తు.

# భారతఫక్కి.

మొదటిభాగము.

ఇది

రాజమహేంద్రవరసర్వకళాశాలా
ప్రధానోపాధ్యాయులై
యుపకారవేతనమునొందుచున్న

ఆకుండివ్యాసమూర్తిశాస్త్రులవారిచే

[illegible]యింపఁబడినది.

[illegible]టికూర్పు 750.





శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల,
పిఠాపురం.
1915.



వెల రు 0-8-0.

# సవరణ.

ఇందలి 23 వ పేజీలో మొదటి 7 పఙ్త్తులు మఱియొక గ్రంథములోని విషయమునకు సంబంధించినయుత్తరము. ముద్రాపకులు ప్రమాదమున నిందుఁ గూర్చిరి. కావున నవి విడిచివేయవలెను.

[illegible] ప్రమాదములను బాలకులు సవరించు.





# భారతభక్తి.

## మొదటిభాగము.





ఇది

రాజమహేంద్రవరసర్వకళాశాలా

ప్రధానోపాధ్యాయులై

యుపకారవేతనమునొందుచున్న

ఆకుండివ్యాసమూర్తిశాస్త్రులవారిచే

రచియింపఁబడినది.



శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల,

పిఠాపురం.

1915.

వెల రు 0—8—0.

ఓమ్

శ్రీవ్యాసేశ్వరాయనమః.

# భారతఫక్కి.

---

## ఆదిపర్వము ౧ ఆ.



శ్రీనన్నయభట్టారకాది కవిత్రయముచే నాంధ్రీకరింపఁబడినమహాభారతము తెలుఁగుభాషకుఁ బ్రధానప్రమాణగ్రంథ మగుటఁజేసి యందలిప్రయోగసరణి వెల్లడిపఱిచి భాషాభిమానుల యనుగ్రహమునకుఁ బాత్ర మయ్యెదనని యీఫక్కిని వ్రాయఁ దొడంగితిని. విశేషజ్ఞులు నాపరిశ్రమము నెఱింగి నన్నుఁ బరిహృతప్రమాదుఁ జేయుదురు గాత!

పూజ్యుఁ డగునన్నయభట్టారకుఁడు సంస్కృతమహాభారతముఁ దెలిఁగించుచు నిర్విఘ్నంబుగ ముగియుట కాశీర్వచనరూపలక్షణమునఁ బ్రబంధముఖము నలంకరించుచున్నాఁడు.

శ్లో. శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాంగేషుయే
లోకానాం స్థితిమావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తేవేదత్రయమూర్త యస్త్రిపురుషా స్సంపూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాం బుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే.

వ. అని సకలభువనరక్షణప్రభువులై యాద్యులైనహరిహరహిరణ్యగర్భపద్మోమావాణీపతులస్తుతియించి

పద్మాదిపతు లగు హర్యాదుల నుతియించి యనియర్థము. మయూరవ్యంసకాదులు దక్క విశేష్యపూర్వపదకర్మధారయము లుండవు. కావు నీసమాసము చింత్యము. "రామలక్ష్మణసీతోర్మిళావల్లభుల" వనినట్లు సాక్షేపము గా నున్నది. హరిహరహిరణ్యగర్భులఁ బద్మోమావాణీపతుల" నని కవిహస్తలిఖితమేమో? పద్మాదిపతు హర్యాదులఁ బొగడి రాజరాజనరేంద్రుని 3 రాజకులైకభూషణుఁడు 4 విమలాదిత్య

తనూజుఁడు 5 చళుక్యమన్మథుఁడు 6 సర్వలోకాశ్రయుఁడు; విష్ణువర్ధనుం డొకఁడే నాఁడు నన్నపార్యుఁ జూచి యిట్లనియె నని యిందు మొట్టమొదటివాక్యము పలకము.

7 సీ. నిజమహీమండలపరిజనప్రీతిఁ బెంచుచు......—

9 సీ. తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళజపహోమతత్పరు—

ఇవిరెండును సర్వప్రాససీసములు.

15 చ. అమలసువర్ణశృంగఖురమై కపిలం బగుగోశతంబు ను
త్తము లగువేదవిప్రులకు దానము చేసినతత్ఫలంబు త
థ్యము సమకూరు భారతకథాశ్రవణాభిరతిన్.—

ఛాయాప్రధానమగు తరువు ఛాయాతరు వనినట్లు వేదప్రధాను లగువిప్రులు వేదవిప్రు లనిగాని, శాకప్రియుఁ డగుపార్థివుఁడు శాకపార్థివుఁ డనినట్లు వేదప్రియు లగువిప్రులు వేదవిప్రులనిగాని మధ్యమపదలోపసమాసమును జెప్పుకొనవలయును. 'చేసినఁదత్ఫలంబు' అని యర్థానుస్వారసహితపాఠమునందు 'చేసినన్' అనునది చేదాద్యర్థకము. అట్టినూఱావులను బాతురల కిచ్చినచో, తత్ + ఫలంబు=ఆదాన మునకు స్మృతిపురాణములం బ్రసిద్ధమైనప్రయోజనము, ఆసక్తితో భారతకథవినుట వలనఁ గలుగునని యర్థము.

21 హరిహరాజగజాననార్కషడాస్యమాతృసరస్వతీ
గిరిసుతాదికదేవతాతతికి న్నమస్కృతిఁ జేసి

మొదటిశ్రీవాణీత్యాదిశ్లోకమున రాజరాజనరేంద్రుఁడు మూర్తిత్రయమును ను తించినట్లు చెప్పఁబడినది గావునఁ గవికృతదేవతానమస్కృతి యిది. మొదటిగద్యము నంబోలె నీపద్యమున మూర్తిత్రయమును గ్రహించి, గణపతికుమారస్వాములకు నడుమ సూర్యుంగూర్చి, శివమాతలకుఁ బిదపఁ బతిపాతక్రమవిరుద్ధముగ సరస్వతిని, పార్వతిని చేర్చికొని, లక్ష్మి నాదిపదగ్రాహ్యం జేసి,యిట్లు దేవతానమస్కారరూపప్రబంధముఖ లక్షణమును నెరపెను.

22 భారతభారతీ శుభగభస్తిచయంబులఁ జేసి ఘోరసం
సారవికారసంతమసజాలవిజృంభణమాపి సూరిచే

తోరుచిరాబ్జబోధనరతుండగుదివ్యపరాశరాత్మజాం
భోరుహమిత్రుఁ గొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్.

విశేషణ యుతుండగుపరాశరాత్మజాంభోరుహమిత్రుఁ గొల్చి యనిచెప్పినపిదప వ్యాసునకు "మునిపూజితున్, భూరియశోవిరాజితున్" అని మరల రెండువిశేషణములు గూర్పఁబడినవి. ఇట్టిసమాప్తపునరాత్తము లీయాంధ్రమున నందందుఁ గానంబడును. ఉక్తితాకాంక్ష గలసమాప్తపునరాత్తదోష మనింద్యమని సర్వత్ర దలంపవలయును.

బాదరాయణుఁడు తనమనంబునఁ గల్పించికొనియున్నభారతకథను శ్లోకరూపముగ వచించునప్పుడది వ్రాయుటకు విఘ్నేశ్వరుఁడు లేకరిగా నుండె" ననిమూలమున నుడువఁబడినకథ తెనిఁగింపఁబడలేదు.

27 నైమిశారణ్యపుణ్యక్షేత్రమునఁ

31 ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని—ఇవిరెండును సర్వయతిసీసములు.

33 ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు........
గావించు నెప్పుడు భావించి వినుచున్న.........

ఇందు భావించివినుచున్న యనుచోట "కామించి వినుచున్న యని పూర్వపాఠమేమో యని తోఁచుచున్నది. అట్లయినచో నిదియు సర్వయతిసీస మగును. నన్నయభట్టారకుఁడు మొదట సీసపద్యములలో యతిమొదలుపెట్టిన నదియే కడవెల్లను, ప్రాసము మొదలువెట్టిన నదియే కడవెల్లను, జెప్పుచు వచ్చి క్రమముగా నానియమమును వదలినట్లు కనుపట్టును.

34 తొమ్మిదివేలుం దొమ్మన్నూటయెనుబదినాలుగు శ్లోకమ్ములు—'నూఱు నెనుబది' యని యుండఁదగు. 'నూట' అనునది కళ కానోపదు.

44 జంబూషండవినిర్మాణము—ఖండయని యుండవలయును.

57 బుద్ధికిఁబంద్రెండవపర్వం, బకదున్మిలనఁగ శాంతిపర్వంబొప్పున్.
పర్వంబు + అ. అవిఛేదము అ. ఎ. ఒ. ఇట్టియచ్చుల కఖండయతి యనింద్యమని తెలియునది.

క. పదిదినము, లైదుపొద్దులు, పదపడి రెన్నాళ్లునొక్కపగలుఁ రేయు
నమ్మదమున రణమొనరించిరి, నదిసుతగురుకర్ణశల్య నాగపురీశుల్

భీష్ముఁడు పదిదినములు, ద్రోణుఁ డైదుదినములు, కర్ణుఁడు రెండుదినములు, శల్యుఁడు దుర్యోధనుఁడు నొక్కొకపవలును రణమొనరించిరని యర్థము సెప్పఁగా రేయి మిగిలినది. పదునెనిమిదవనాఁటిరాత్రి పాండవసైనికులకుత్తుకలు గోసినవాఁ డశ్వత్థామ. అతనిఁ జెప్పుపద మిందుఁ గనఁబడదు. "నాగపురీశుల్" అనుపదము విభజించి, నాగపురముగలవాఁడు నాగపురి=సుయోధనుఁడు, ఈశుఁడు=ఈశ్వరావతార మగునశ్వత్థామ అని యెట్లో యర్థము చెప్పఁగానవచ్చును. లేదా, ఆరేయి కూడ దుర్యోధనయుద్ధకాలభాగమే యని పరితుష్టిఁ జెందవలసి యున్నది.

ఉపమన్యువు, ఆరుణి, వేదుఁడు ననువారు గురుకులమునందు వసించినప్పటికథ తెనిఁగింపఁబడ లేదు.

91 పైలశిష్యుఁడు—వేదునకు మాఱుగాఁ బైలుఁడని యిందుఁ గలదు.

93 వానిపన్నినవృషభగోమయభక్షణంబు—పన్నిన యనుదానికి సమాసైకదేశం బగువృషభముతో నన్వయము.

99 క్షణియించిన=నిర్వ్యాపారస్థితిం గోరిన

114 ఇదివడి గలదుమనసుకంటెఁ గాడ్పుకంటె—కలుగుధాతువు ప్రాప్త్యర్థకము సకర్మకము. ఇట వడి కర్మము.

116 ఈయున్న పౌష్యప్రోలికి—ఈ=సన్నిహితమై ఉన్న, ధాతుజవిశేషణము భూతార్థము. షష్ఠీవ్యవహితమైనప్రోలునకు విశేషణము. ఈ + ఉన్న, విశేషణోభయపదకర్మధారయము.

127 మితహితసత్యవాక్య జనమేజయ—నామాఖండయతి

124 కాదన కిట్టిపాటియుపకారము తక్షకుఁ డేకవిప్రునం
బోధనఁ జేసి చేసె నృపపుంగవ! నీవు ననేకభూసురా
పాదితసర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
క్రోదరసంహతిన్ హుతవహోగ్రసమగ్రశిఖాచయమ్ములన్.

ఈపద్యమును మనకంటెఁ బూర్వుఁ డప్పకవి దధలప్రాసవిధికి నుదాహరణముగఁ గొనె.

శ్రీనృసింహపురాణమున

వేదములాదిగఁ గలయష్టాదశవిద్యలకు నీవ స్రష్టవు తత్త్వ

ద్బోధకులును భవదాజ్ఞాపాదకులు సమస్తధర్మపాలనచతురా.

అని ఎఱ్ఱాప్రగ్గడప్రయోగమును,

విరాటపర్వమున

క. ముదమొదవ రమ్యహర్మ్యము
తుదినిలువున నిష్టసఖులతోడ విహారా
స్పదమవునెలవున మెలఁగెడు
సుధేష్ణతజ్జాలకములఁ జూచెం బ్రీతిన్.

ద్రోణపర్వమున

క. వింధ్యాద్రివోలె నాప్రతి
వింధ్యుఁడచలితోగ్రమూర్తి వెలయ నిలిచి గ
ర్వాంధ్య మలరఁగను దీప్త
వంధ్యాస్త్రము లక్కుమారవరుపైఁ బఱపెన్.

అని తిక్కనసోమయాజిప్రయోగములు నుదాహరించెను. ఇచట "బోదన" "చోదన" యని యిప్పటివారు దిద్దిరి. దద్ప్రాసనిషేధాభినివేశ మాధునికుల కేలయో?

125 ఉ. ప్రల్లదుఁడై నయొక్కకులపాంసను చేసినదానఁ దత్కులం
బెల్లను దూషితం బవుటయేమియపూర్వము గావున న్మహీ
వల్లభ! తక్షకాధమునెపంబున సర్పములెల్ల నగ్నిలోఁ
ద్రెల్లఁగ సర్పయాగ మతిధీయుత చేయుము విప్రసన్నిధిన్.

ఈపద్యమున నెపంబున, అనుపదమును నెవంబున, అనియు

క. ఉరగకళేబర మంసాం
తరమునఁ బడి వ్రేలుచునికి దలఁపక యచల
స్థిరుఁడై పరమధ్యానో
పరతేంద్రియవృత్తి నున్నవాని శమీకున్. ద్వి. 168

ఇందు ధ్యానోపరత, అనుదానిని ధ్యానావరత, అనియుఁ గొందఱు దిద్దిరి. ఛింత్య
సిద్ధికము లైననెవము, అవరత, పదములతో దిద్దుట నింద్యము

**129 అగ్నిహోత్రిమునకు నగ్నులు విహరింపుము.**

అగ్నిహోత్రమునకు=వేల్మికి, అగ్నులు=అగ్నులను, ద్వితీయకుఁ బ్రథమ. విహరింపుము=అలంకరింపుము.

138 ఇది సిద్ధము కావు జెఱిఁగి—కావుట=అగుటకుఁ బర్యాయము.

142 దేవముఖుండవు=దేవతలమొగము. 'తురంగవదనుఁడు' ఇత్యాదులందువలె నిత్య నపుంసకముఖాదిశబ్దములు బహువ్రీహిసమాసమున విశేష్యలింగము లగును గాని తత్పురుషమున దేవముఖంబవు, ఇత్యాదిరీతిగానే యుండవలయును.

158 భవత్పిత్రుశిష్యుం డైనయత్రికుం డనుబ్రాహ్మణుండు—మూలము మృగ్యము.

## 2 ఆశ్వాసము.

4 కశ్యపప్రజాపతి తొల్లి పెద్దకాలంబు దపంబుఁ జేసి పుత్త్రికామేష్టిఁ జేసెఁ గావున ఈయర్థమునఁ బ్రమాణము లేదు.

10 తనర్పు=పొడవు.

ఓషధీరసవిశేషతయుం గలదు—విశేష్య మగువిశేషశబ్దముమీఁద నీప్రత్యయము వ్యర్థము. విశిష్టతయున్ లేక విశేషమునుం గలదు. అనుట యుక్తము.

11 సర్వశైలములయంతతనర్పును, పనునొకండువేలయోజనంబులతనర్పును—పూర్వోత్తర విరోధము చింత్యము.

**21 సీ. అంతదేవాహితు లమృతంబు గానక. వడిసీసము**
**వరులఁ దాఁకి యేసి రురుతరశరపఙ్క్తి. సర్వప్రాసగీతము.**

24 సాంద్రారుణపూరము—అరుణశబ్దము రక్తశోణితములవలె గుణివాచకము గాని రుధిరవాచకము గాదు.

30 సంపూర్ణచంద్రునందు (నల్లయు) ంబోలె వాలప్రదేశమునందు నల్ల (నై)యున్నది. కుండలితములు విడిచిన హృద్యము.

31 పన్నిదము సలుము—'పన్నిదము సలుపు' అనియే యుండవలయు.

శా. వ్యా. పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడవ్రాయి బహుళముగ లోపించు. పిలువుము, పిలువు, పిలు. ఇది యాగమము కాదు. అకార పుథ్యము కావునంత్యాక్షరము లోపింపదు.

33 సీ. కద్రువ కొడుకులకడ కేగి—వడిసీసము.

36 కద్రువయు వినతయుం జని యత్తురంగంబుం జూచి వినత యోటువడి—చూడఁ అని యుండఁ దగు.

నీచపనులు=హీనకృత్యములు.

38 బోరనఁదానగ్నిసూక్తములతో నెగసెఁ

బోరనన్=శీఘ్రముగా మువిభక్తి యతి.

40 ఇడుగడ=అనూయ. మడవక=మరలఁ జేయక

42 క. ఆపన్నగముఖ్యులఁ దన
వీపునఁ బెట్టికొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు నఖిలది
శాపాలపురములుఁ జూపెఁ జని వారలకున్.

వీఁపు, ఇది సార్ధబిందువు. అప్పకవి ఖండాఖండప్రాసమున కుదాహరించెను. కొందఱిం దర్ధానుస్వారము లేదనుచున్నారు.

46 బొమ్మనందవడుభాముల నోవను—నింద్యము లగుపాముల ననియర్థము. అవడు అగడు యొక్క-రూపాంతరము. తొంటియచ్చులపాఠము బొమ్మనందెపుడు అనియున్నది.

56 క, విషనిధికుక్షి ననంఖ్యము
నిషాదగణ ముండి ధారిణీప్రజకుఁ గడు
న్విషమమును జేయువాని ని
మిషమున భక్షించి చను మమిత్రవిఘాతీ.

ని+సాద=నిషాద, వి+సమ=విషమ. సదిరప్రతేః. సువినిర్దుర్భ్యస్సుపి సూతిసమాః అనుపాణినిసూత్రములచే షత్వములు. ఉభయప్రాసము.

67 క. చఱచి యొకచేతఁ గూర్మముఁ
జెఱచేత గజంబుఁ బట్టి పెనచి ఖగేంద్రుం

డిఱికికొని గగనవీథిం
బఱచె వియచ్చరవిమానపఙ్క్తులు దూలన్.
గజకచ్ఛపమ్ములఁ గరమ్ముల నిఱికికొని
సం॥ నఖేనగజమేకేనకూర్మమేకేనచాక్షిపత్.
పక్షికి రెక్కలు భుజస్థానీయములుగాని పాదములు గావు. ఈప్రయోగము నందలి యౌచిత్యము విచార్యము.

75 క. హిమశైలకందరాభా
గముకడ నిష్ఫురుషనగము గల దచ్చో నీ.
ద్రుమశాఖ విడువు మది దా
సమానుష మగమ్య మిాశ్వరాదుల కైనన్.
సం॥ తతో నిష్పురుషం శైలం హిమసంరుద్ధకందరం
అగమ్యం మనసాప్యన్యైస్తస్యాచఖ్యౌసకశ్యపః.
మంచుగప్పిన గుహలుగలదియు 'తఱులచే మనస్సుచేతను బొందరానిదియు నగు నిష్పు షనగమును గుఱుడునకుఁ గశ్యపుఁడు చెప్పెను.
మంచుకొండ గుహయొద్ద నిష్పురుషశైల మున్నది. యను తెలుఁగనురూపము గాఁ దోఁపదు.

80 వీఁగి=ఉత్సహించి
96 పతుతుండాగ్రనఖతుతదేహు లై—ప్రాసనీసము.
101 తెక్కలికొని=అపహరించి. శబ్దపల్లవము. తెక్కలి=దొంగతనము.
116 దినకరపవనాగ్ని తుహినదీప్తులుకరిగన్. కరి=సాక్షి, దేశ్యము.
120 శ్రీసంపదలు=లక్ష్మీసమృద్ధులు
125 చిరముగ బ్రహ్మకుం దపము సేసి=బ్రహ్మనుగ్రహముకై, చతుర్థ్యర్థమున షష్ఠి.
127 ఊకరిత వుడుగు మనియు—క్రియ + ఉడుగు=మాను, సకర్మకము.

139 క. అనఘ యిది యేటితప మే
మనుపమదుఃఖితుల మగుట నాధారములే

కను సంతానచ్ఛేద
మ్మనఁ బ్రేలెద మథమలోకముల తెరువుసనర్.

ఆధారములేక + అను + సంతానచ్ఛేదంబున ఆధారములేక=దిక్కుఁ జెందక, అను=నీ తర్వాత, సంతాన=వంశముయొక్క, చ్ఛేదంబున=అపాయంబుచేత, అని విభజించి సదర్థము సేయవలయును. 'కాదన కిట్టిపాటియపకారము' (అనక + ఇట్టి) మొదలగు స్థలములఁ బ్రామాణికనిత్యసంధిప్రయోగము గలవ్యతిరేకక్త్వార్థకము ద్రుతప్రకృతిక మనుభ్రమము విడుచునది.

150 చిత్తానంద మొందెన్=ఒందెన్=కలిగెను. కలుగుధాతువువలె ఒందుధాతు వకర్మకమును గలదు.

153 తనపతికిం బ్రియముసేసి తద్దయుగర్భంబనురక్తిదాల్చియొప్పెను

తద్దయుఁ బ్రియముసేసి, అనురక్తిగర్భముదాల్చి, అని సమన్వయము.

154 కుఱువు=లోడ.

155 పదరునో=పరుసములాడునో, ఓడఁడె=భయపడఁడా.

158 క. చ్యవనసుతుఁడైన ప్రమతితోఁ జదివె సకలవేదవేదాంగ
ములు—సంస్కృతము మృగ్యము.

161 అఱువదియేడులు రాజ్యంబు సేసిన—ప్రమాణము లేదు.

162 ఎగచి—ఎగిచి యనవలయు.

163 అమిత్రమతభేది యొక్కరుఁడయమృగాన్వేషణ భ్రమాకులితచిత్తుఁడై—ఆ మృగ + అన్వేషణ, ఆహరిణమును వెదకుట కై తిరుగుటచేఁ గలంపఁబడినమది గలవాఁడై. యతికై మార్పరాని ఆ అనుపదమును మృగాన్వేషణ మొదలగుసిద్ధ సంస్కృతసమాసము నేకదేశ మగుమృగపదముతోఁ దన్మృగాన్వేషణ యనున ట్లన్వయము.

167 మొదవులచన్నులు వత్సంబులు గుడుచునప్పు డుద్గతంబగుపయః
ఫేనంబె, తన కాహారంబుగా.

శమీకుచరితములోఁ గానఁబడదుగాని, భారతసంబంధిగామిచేఁబోలుఁ దెలిఁగింపఁ బడనియుపమన్యుచరితలో నున్నది.

భోః ఫేనంపిబామియమి మేవత్సామాతౄణాం

స్త్రనాత్ప్రబంతఉద్గిరంతి. తముపాధ్యాయఃపప్రిత్యువాచ
ఏతేతదనుకంపయాగుణవన్తోవత్సాఃపరిభూతతరం ఫేన
ముద్గిరంతితదేషామపివత్సానాంవృత్త్యుపరోధంకరిష్యసి

170 చన్నే—చనునే, తగునా, చను నేయనుటకుఁ జన్నేయనియు, ఉంచునే యనుట కున్నేయనియు రూపాంతరములు.

'అడవిఁ దన్నుఁ బాసి యరిగిన నలిగి కాకున్నె' యనినలచరిత్రమునందును బ్రయోగింపఁ బడినది.

171 భిన్నకుంభమునతోయములట్టుల—షష్ఠీతత్పురుషమున నకారాగమము. ఇందుఁ గుంభమునఁ దోయములట్టుల అని వ్యస్తము నుండనగును.

173 క్షత్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁబుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రు లనఁగాఁ దగునాలుగుజాతుల న్స్వచా
రిత్రము దప్పకుండఁగఁ బరిక్షితు కాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగమ్ములన్.

అని అప్పకవి యుదాహరించెను. సంస్కృతవ్యాకరణమున ఋకారైకదేశము రేఫము అని ప్రసిద్ధము. తదనుసారమున ఋ అనుఅచ్చుతోఁ గూడినహల్లును రేఫముతో గూడిన హల్లును, ప్రాసములు కాఁదగును. 'ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు .నను సూత్రముచే ' మాంధాత్రరఘుక్షితీశు ల ' నుపాఠమును సాధువు.

175 తలరన్=చలింప.

181 ధరణిఁ జరాచరభూతసంఘంబు దమవిషవహ్ని
నురగంబు లేర్చుచునునికి కలిగి పయోరుహగర్భుఁ
డురగవిషాపేతజీవసంజీవనోపదేశంబు
గరుణఁ గశ్యపునకు నిచ్చె నఖిలలోకహితంబుపొంటె.

ఈపద్యమునకు మూలము :—

ఆహూయకశ్యపందేవ ఇదంవచన మబ్రవీత్
యఏతేదందశూకాశ్చ సర్పాజాతాస్త్వయానఘ

విషోల్బణామహాభోగామాత్రాశప్తాఃపరంతప
తత్రమన్యుస్త్వయాతాతనకర్తవ్యఃకథంచన
ఇత్యుక్త్వాసృష్టికృద్దేవస్తంప్రసాద్యప్రజాపతిమ్
ప్రాదాద్విషహరీంవిద్యాంకశ్యపాయమహాత్మనే.

“ చతుర్ముఖుఁడు కశ్యపునిబిలిచి యిట్లు పలికెను. కశ్యపా! నీకొడుకు లగువిషసర్పములను దల్లికద్రువ శపించె. దానికి వగవకు మనియనునయించి విషహర మగుమంత్రము నాకశ్యపప్రజాపతి కొసంగెను.” మూలముననీశ్లోకములు కద్రువ సర్పములకు శాపమిచ్చినఘట్టమునందుఁ గలవు. భట్టారకుఁడు వాని నక్కడఁ దెనిఁగింపకవిడిచి పరీక్షితుని బ్రదికించుటకు బయలుదేరినకశ్యపు డనుబ్రాహ్మణున కన్వయింపఁజేసెను. మాంత్రికుఁ డగునీకశ్యపుఁ డనుబ్రాహ్మణుఁడు బ్రహ్మవలన విషహరి యగువిద్యను బడసినకశ్యపప్రజాపతియే యనుటవలన నట్టివాఁడు ధనమున కాసించి వచ్చుటయుఁ దనకుమాఱఁ డగుతక్షకునివలన ధనగ్రహణము చేసి క్రమ్మఱి చనుటయు నసంగతములుగాఁ దోఁచును.

193 అమరేంద్రాద్రి కారుఁడు దద్వన్యఫలజిఘత్సాపేక్షన్.

అత్తుమిచ్ఛా=జిఘత్సా=తినఁగోరిక. సన్ప్రత్యార్థ మైనఇచ్ఛ, అపేక్షాపదముచేఁ బునరుక్తమయినది.

196 తనుకఁ=జ్వలింప

198 కనుకని=సంభ్రమము, త్వర.

204 నీతదర్థముగాఁగ=నీకొఱకు, తస్మైఇదం=తదర్థమ్. అర్థేననిత్యసమాసోవిశేష్యలింగతాచ, నీయొక్కఆపనికై. ఇట్లీకవి తఱచు ప్రయోగించును. ఇది చోద్యమగుప్రయోగము.

215 త్రస్తాత్ముల మైనయస్మదాదుల కెల్లన్—అస్మద్యుష్మచ్ఛబ్దములకు మీఁద నచ్చులుగూర్చిన నుభయంబును జెల్లును. ఇట హల్లునకు యతి.

225 వారిజవైరికులేశ నీకు సం
పూర్తమనోరథమ్ములును బుణ్యఫలమ్ములు నిచ్చుచుండెడున్.

‘సంపూర్తిమనోరథమ్ములును’ అని దిద్దవలయు.

233 ముద। మునఁ దలఁచిన నురగభయము వొందదుజనుల౯

పొంద దనుప్రాచీనముద్రితపాఠమె సాధువు. పాదాద్యక్షరము పవర్గీయ మైనచో విశ్రమస్థానమునం దుండుపకారమునకు వకారాదేశముచేయుట పూర్వకవిసమ్మతము గాదు. 'ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టుడు' ప్ర.ఆ. 156 మొదలగుచోట్ల నిట్లె తెలియునది.

## తృతీయాశ్వాసము.

7 సమస్తజనపాలసభాజనయోగ్యుని=(సభాజ ప్రీతిసేవనయోః) అందఱురాజులు గొలువఁదగినవాని.

12 దుర్ణయమునశకునికర్ణదుశ్శాసనుల్—అను సర్వపాద్రిసనీసము నాటగీతిని దుర్న్నయమున అని యుండవలయును. దురఃషత్వణత్వయో రుపసర్గత్వప్రతిషేధో వక్తవ్యః ఉభయపాఠసను భట్టారకునకు సమ్మతంబ. 'అక్షౌహిణి, యా నిరంతరప్రమాణసంఖ్య, ప్ర. ఆ. 80

14 సీ వదలక కురుపతి, అర్ధయతిప్రాసనీసము. సర్వపాఠసగీతము.

16 ద్వారవతి కేగి యర్జునుఁ డారంగ సుభద్రఁ జెండ్లియై వచ్చి—'మనసు' అనియో 'ముదము' అనియో అధ్యాహరించి. మనసారన్=మనఃపూర్తిగా, ముదమారన్=సంతస మెచ్చఁగా ననియర్థము చెప్పికొనవలయును.

19 అక్కర—మధ్యాక్కరమన నే తగును

జనపదంబున నుండి తపన నయ్యేండ్లు సలిపి సద్వృత్తు

లసఘులు మును వేఁడికొనక మఱిభారతాజి సేయంగ—

శ్రీకృష్ణు నంపి రైమూళ్లే నిన్మని యడిగియే పోరికిగాన

వేఁడి=ప్రార్థించి, కొనక=సరిపడక యనియర్థముచేసికొనవలయును. తపన=తపనము, తాపము. శ్రీసమప్రయోగమునకిదియు దాహరణవిశేషము.

25 అగ్నిరిక బులిమలియైన దీనికి మృగమాంసంబు దెచ్చిపెట్టుమని తనపితృదేవతలు పంచిన నప్పు డయ్యుపరిచరుండు మృగవధార్థంబు వనంబున కరిగి—

సం॥ వసోఃపత్నీతుగిరికా కామకాలంన్యవేదయత్

ఋతుకాలమనుప్రాప్తాస్నాతాపుంసవనేశుచిః

తదహఃపితరశ్చైన మూచుర్జహిమృగానితి
తంరాజసత్తమం ప్రీతా స్తదామతిమతాంవర
సపితౄణాం నియోగం తమనతిక్రమ్యపార్థివః
చచారమృగయాం కామీగిరికామేవసంస్మరన్.

“గిరిక వసురాజునకు ఋతుకాలమును దెలిపెను. ఆదినముననె పితరు లారాజశ్రేష్ఠు న్మృగములంగొట్టుమని ప్రీతి నడిగిరి. ఆఱేఁడు పిత్రాజ్ఞమీఱక, వలపునగిరికనే తలంచుచు వేఁటాడెను.” గిరికకు మృగమాంసము పెట్టుమని పిత్రాజ్ఞయయినట్లు గను పట్టదు.

26 సీ. పలుకులముద్దను గలికికాళ్లన్నుల—

సర్వైకప్రాసనీసము. సర్వప్రాసనీతము. ‘అలఘుకాంచీపదస్థలములయొప్పును’ గుణస్థలమునయొప్పను అని యుండఁదగును. కుమారసంభవమునందు “ఏతావతానన్వనుమేయశోభి కాంచీగుణస్థాన మనిందితాయాః ఆరోపితం యద్గిరిశేన పశ్చాదనన్యనారీకమనీయమంకమ్” అనుశ్లోకమును గవి తలంచియుండును. కాంచీగుణస్థానము నితంబము. షష్ఠీతత్పురుషమున నకారాగమము. ‘జవ్వనంబునవిలసనము’ ఇదియు షష్టిసమాసమే.

29 యమునానదివనమధ్యమునందు—నదిసుతేత్యాదిదీర్ఘసమాసమునందువలెహ్రస్వము. తత్సమసమాసమేని యగును. వన=జలముయొక్క.

34 తలోదరి—తల=శూన్యమైన, ఉదర=నడుముకలది. అనుదరాకన్యాయన్నట్లె. సన్నపుఁగౌను గలది.

36 సీ. చపలాక్షిచూపులచాడ్పున కెద మెచ్చు—సర్వయతినీసము.

38 తనువు=మేను, మీనొప్పలవల్చు=మత్స్యమాంసపుగౌలుకొట్టు.

41 పరమేష్ఠికల్పుఁడగు నప్పరాశరసమాగమమున—

పరమేష్ఠికల్పుఁడు. అగు. ఆ. పరాశరసమాగమమున, పరాశరేత్యాదిసిద్ధసమాసావయవమైనషష్ఠ్యంతపరాశరశబ్దమునకుఁ బ్రథమాంత మగు ‘పరమేష్ఠికల్పుఁడు’ అనుతత్సమమును, అగు. ఆ. అనుదేశ్యవిశేషణములును అన్వయించుట ప్రయోగవైచిత్ర్యము.

49 సీ. పరశురాముండు భీకరనిజకోపాగ్ని, నుగుర్రైవ యిరువదిరొ

క్కమాలు. అరవడిసీసము.

53 జితకాశులు=గెలుపుచేఁ బ్రకాశించువారు.

62 అజితశక్తియుతదనాయుష యనుచాని—ఇందు స్వరవిభాగ మున్నదో లేదో విచార్యము.

64 సీ. మఱియంగిరసుఁడనుమానసపుత్త్రున—వడిసీసము.

68 సీ. విగతాఘుఁడైనయాభృగునకుఁబుత్త్రిఁడై-సర్వప్రాసీసము

92 యయాతి రాజై యనేకయాగంబులు సేసి శుక్రపుత్రియైనశర్మిష్ఠయందు యదుతుర్వసు లనునిద్దఱుకొడుకులం బడసె.

92 సం॥ త్వత్తఃశ్రుతమిదంబ్రహ్మన్ దేవదానవరక్షసామ్

అంశావతరణం సమ్యగ్గం ధర్వాప్సరసాంతథా

ఇమంతుభూయ ఇచ్ఛామికురూణాం వంశమాదితః॥

కురువంశము మొదటినుండి వినవలతు నని రాజడిగిన, వైశంపాయనుఁడు.

భరతాద్భారతీకీర్తిర్యేనేదం భారతంకులమ్

అపరేయేచపూర్వే వైభారతా ఇతి విశ్రుతాః

తేషాంతుతేయథాముఖ్యం కీర్తయిష్యామిభారత॥

భరతునివలన నీగ్రంథమునకుఁ గులమునకు భారత మనుపేరు కలిగినది. ఈవంశము వారు వెనుకటివారు తర్వాతివారును భారతులని ప్రసిద్ధి నొందిరి. వారిలోఁ బ్రధానులఁ గ్రమంబునఁ జెప్పఁగలను. అని భరతునిముఖ్యతచేఁ దజ్జన్మము దెలుపఁగడఁగి దుష్యంతచరిత్రమును మొదటఁ జెప్పెను.

యయాతిః పూర్వజోస్మాకం దశమోయః ప్రజాపతేః

కథంసశుక్రతనయాం లేభేపరమదుర్లభామ్॥

మాపూర్వుఁ డగుయయాతి, బ్రాహ్మణుఁ డగుశుక్రుకన్నె నెట్లు పెండ్లాడెను. అను ప్రశ్నము ననుసరించి యయాతిచరిత్రము తరువాతఁ జెప్పెను. ఇది సంస్కృతఫణితి. రా జడిగినట్లు వంశక్రమము ముఖ్యముగ నాలోచించి నన్నయభట్టారకుఁడు పూర్వుఁ డగుయయాతిచరిత్ర మొదటఁ జెప్పి దుష్యంతుచరిత్రమును బిదప వాక్రుచ్చెను.

101 పోరను మృతసంజీవని

కారణమున నిహతు లయ్యెఁ గా రసురవరుల్.

అసురవరులు పోర న్నిహతు లయ్యె, మృతసంజీవనికారణమున (నిహతులు) కారు. ఇట్లు వివక్షానుసారముగఁ బద్యములం బదక్రమము మార్చియు, నధ్యాహరించియు నవర్థము గ్రహింపవలెఁ గాని ప్రయోగసాన్నిధ్యమున విపరీతార్థము చేయరాదని వేద్యము.

102 క. మనపక్షమ్ముననవా ర
ద్దనుజులచే నిహతు లయ్యెఁ దగమృతసంజీ
వనిలేమిఁ జేసి శమనుస
దనమున కరుగుదురు వీర్యదర్పితు లయ్యున్.

మనపక్షమునవారు (సురలు) పరాక్రమాహంకారము గలవా రయ్యును రాక్షసహతు లయ్యున్=(అయి + యు) అయి యనియర్థము. 'యున్' పాదపూరణము. మృతసంజీవని యనుమంత్రము లేమి యనులోకము నొందుదురు. అని పూరణక్రమములఁ దెలిసి యన్వయింపవలయును. తలంపఁగా, 'అయ్యున్' అనుద్రుతాంతావ్యయము విరుద్ధధర్మమును సూచించునపుడే వాడఁబడుచున్నది. కావున దీనికిఁ బైనున్నపద్యమునందు 'కారణమున నిహతులయ్యె' నని యుండుటచేఁ దత్ప్రాబల్యమున నిందును 'నిహతులయ్యె' నని లేఖకుఁడు వ్రాసియుండునని యూహింపనయ్యెడి. అట్లయినచో 'నిహతు లగుచు' నని కవికృతపాఠము కావచ్చును.

107 సంతుష్టుంగాఁ జేసి, శిష్యుంగాఁ జేసికొని—ఇచట సంతుష్టుంజేసి, శిష్యుంజేసికొని అనిన నాక్షేపము లేదు. కాన్ అనుపద ముంచినచో భావార్థకాదియోగంబునఁ గర్తకుఁ బ్రథమ యగు నను సూత్రము ననుసరించి సంతుష్టుఁడుగఁ జేసి, శిష్యుఁడుగఁ జేసికొని యని కర్తృపదమునఁ బ్రథమ యుండవలెను. ఇట్టి వార్థములుగాఁ దెలియ నగును.

112 పొడవు=శరీరము. 114 వగవక=అరయక.

132 సురకరువలి=సురగాలి, సుడిగాలి.

133 లోకోత్తరచరితుం డగునాకావ్యతనూజ—41 పరమేష్ఠికల్పుఁ డగురాన్నపశరసమాగమమున—అనుదానివలె గ్రాహ్యము.

138 లతూ—పమున విలసతూ—లఘునవల్లి యన్నిష్టసఖినూదియున్న దాని—అన్న +

ఇష్టసఖి. రూపాంతరము, అనిన=అనఁబడిన, పుట్టినిల్లు అనునట్లు సంధిదోషము లేదు. అను + ఇష్ట. అని భ్రమ నొందరాదు.

140 గతభ్రములఁగా=భ్రిములుగా ననియె యుండవలయును.

150 క. వారణఘోటకభాండా
గారంబులు మొదలుగాఁగఁ గలధనములతో
సూరినుత యిందఱను నీ
వారకములుగాఁగ మమ్మ వగవుము బుద్ధిన్.

మొదలుగాఁగగలధనములతో, (గాఁగవ్యర్థము.) మమ్మ నిందఱను నీకు దేయద్రవ్యములుగానరయుము.

154 సీ. అంగనాజనులయుత్తుంగసంగతకుచ
కుంకుమచందనపంకములయు
వారివ, ధమ్మిల్లభారావకలితది
వ్యామోదనవపుష్పదామములయు
వారివ, ముఖనకర్పూరతాంబూలాది
వాసనాసురభినిశ్వాసములయు
వారివ, పంథానచారుధూపములయు
విలసితసౌరభావలులుదాల్చి

తే. గీ. యనిలుఁ డనుదూత వోయి తోడ్కొనుచుఁ దెచ్చె
దేవయానిపాలికి మృగతృష్ణఁజేసి
కాననమ్మునఁ గ్రిమ్మరువాని వీరు
నతిపరిశ్రాంతుఁ డైనయయాతిసంత.

అంగనాజనులయుత్తుంగసంగతకుచకుంకుమచందనపంకముల (యొక్క) సౌరభావలులు, వారివ (వారి + అవి + అ) ధమ్మిల్లభారావకలితదివ్యామోదనవపుష్పదామముల (యొక్క) యు సౌరభావలులు, ఇట్లేతక్కినవియు నన్వయించుకొనవలయును. 'యు' కారమకుటము లగునీతత్పుకుషపూర్వభాగము లనేకపదవ్యహిత మగు "విలసితసౌర

భావలులు " అనుపదముతో సమసించుచున్నవి. సమాసలక్షణం బగువిభక్తిలోప ముండుటచే నివి సమాసములు గాక తీరదు. సాంకాంక్షము లై యసమర్థము లగుట చే వీనికి సమాసార్హత సంస్కృతవ్యాకరణానుసారముగా లేదు. అనుక్తమన్యతో గ్రాహ్యమ్మని యున్నది.రైన నాంధ్రవాగనుశాసనునియిట్టివిచిత్రసమాసములు గ్రాహ్యములు. 'వారివి' అనుప్రథమాంతములు సమాసాంతర్గతషష్ఠీవిశేషణములు.

158 నిగ్రహము=త్రోపాట, నిరాకరణము. ఏది=అడచి, నశింపజేసి, ఏదన్=నశింపగ. ఇట్లు దిద్దసైనవలయు.

176 క. చను బొంకగ బ్రాణవ్యయ
మున, సర్వధనాపహరణమున వధగావ
చ్చినవిప్రార్థమున గవా
శనయానంబుల వివాహసమయములందున్.

సం॥ ననర్మయుక్తం వచనం హినస్తి
నస్త్రీషురాజన్నవివాహకాలే
ప్రాణాత్యయే సర్వధనాపహారే
పంచానృతాన్యాహు రపాతకాని॥

'పరిహాసమున, స్త్రీలందు, వివాహకాలమునం, బ్రాణాపాయమున, సర్వధనాపహారమున, నీయైదిట నసృత మాడినవాఁడు పాతకఫలముచేఁ బీడింపఁబడఁడు'
ప్రాణములపోకడ, ఎల్లధనముదోఁపు, పెండ్లి, ఈమూటివేళల నని సరిగఁ దెలిఁగించి నవ్వుటాలయందును, నవలాలతోడను, నసృత మదోషమని యాంధ్రీకరింపక యాసన్న మరణుఁ డైనబ్రాహ్మణుని రక్షింప నని 'ప్రాణివ్యయమున' అనుదానిలో విశేషము నే చేర్చి ఆవులమేఁతయందును యాత్రయందును బొంకు పాపముగాదని యాంధ్రకవి మార్చుటకుఁ గతి మూహ్యము.

177 ఎందేనినుండి యొక్క—మహాముని—ఎందున్ + ఏనిన్ + ఉండి=బ్రహ్మలోకము వలన పంచమికి ద్వితీయాసప్తములు, ఉండి పదానుప్రయోగమును వికల్పవిహితము లగుట బ్రహ్మలోకమునుండి, బ్రహ్మలోకమునందుండి యని ప్రయోగింపవలయునపుడీకవి 'యేని' పదమధ్యముగాఁబ్రయోగించి "ప్రభ్రంశయాం (యోనహుషం) చకార, అని ఆమంతాల్లిట్పరాః.కృభ్వస్తయోనుప్రయుజ్యంతె

యను విధి ననుసరించి యవ్యవహితముగ ననుప్రయోగము చేయనికాళిదాసుం దలంపించెను. ద్రుహ్యానుపూరులనంగా—ద్రుహ్యు + అనుద్రుహ్యాను, ఈ విషమసంధి హాయవలసంయోగము.

182 క. తరుణప్రదేశినుల మా
సరముగ వారలు యయాతిశర్మిష్ఠలఁజూ
పిరితండ్రియుఁ దల్లియునని—

బాలురు యయాతిశర్మిష్ఠలఁ దండ్రియుఁ దల్లియునని మాసరముగఁజూపిరి. మా సరముగ=చక్కఁగ. ఇది సంస్కృతమఁట. ఆంధ్రనిఘంట్వాదులనేగాని అమర భాషాగ్రంథములనెందును గానఁబడదు.

183 ఇట్లు దన్నెఱుంగకుండ నయ్యయాతి శర్మిష్ఠవలన లబ్ధసంతానుం డగుట— ఎఱుంగక + ఉండ=తలంపక, సరకుసేయక.

185 అయ్యయాతియు దానిం బట్టువఱుచుచు=అనునయించుచు

189 క. తల వడఁకఁదొడఁగె నింద్రియ
ములగర్వ మడంగె నంగములు వదలె వళీ
పలితమ్ము లయ్యె వగరును
దలయేరును నుక్కసయును దలకొనుదెంచెన్.

అంగములు=అవయములు, వదలెన్=శైథిల్యము నందెను. వళీపలితమ్ములు=ముడుతలు నరలును, అయ్యెన్=కలిగెను, వగరు=శ్వాసము, ఏరు=నొప్పి, ఉక్కస=పొడిదగ్గు, తలకొనుదెంచెన్=కలిగెను.

205 సీ. వదనబాణాసన వ్యక్తముక్తములైన
పలుకు లన్కడువాఁడి బాణతతుల
బరమర్మలక్ష్యముల్ వాయక భేదించు
చుండెడుదుర్జన యోధవరుల
కడనుండకున్నది కరుణ యార్జవ మక్ష
జయము సత్యంబును శమము శౌచ
మనునివి యెద నిల్పునది—

‘ కడనుండకున్నది ’ అనుదానిని కడనుండి విడునది యని సవరింపవలయు. లేకున్న నర్థము లేదు. పైనున్న పద్యములందలి ప్రక్రియ మరయునది.

210 వాఁడును మనుష్యలోకంబునకుం బోవనోపక యంతరిక్షంబున సద్భవనంబున సత్సంగతి నుండునట్లుగా నాకుఁ బ్రసాదింపవలయు నని యింద్రు ననుమతంబు వడసి.

210 గీ. అంతరిక్షంబు నఖిలదిగంతములును
వెలుఁగఁ జనుదెంచు నాతని విమలదీప్తి
సూచిసద్గుణములు గడుఁ జోద్యమందె
నురుతరద్యుతి యిది యేమియొక్కొ యనుచు.

వాఁడుచనుదేర నాతనిదీప్తి సూచి సద్గుణములు చోద్యమందె ‘ చనుదేరనాతని ’ యని దిద్దినచోఁ జక్కఁ నన్వయించును.

212 యయాతియనఁగ నడిననువాఁడన్ =అపకీర్తిలేనివాఁడను. పేర్పడినవాఁడను.

220 మానాగ్నిహోత్రమును మఱి
మానాధ్యయనమును మానమౌనమ్మును వి
జ్ఞానమున మానయజ్ఞము
నా నియతార్థమ్ము లివియు నాలుగు నుర్వీశ.

సం॥ తపశ్చదానంచశమోదమశ్చహ్రీరార్జవంసర్వభూతానుకంపా
స్వర్గస్యలోకస్యవదంతిసంతోద్వారాణిసప్తైవమహాంతిపుంసామ్
నశ్యన్తిమానేనతమోభిభూతాఃపుంసస్సదైవేతివదంతిసంతః
అధీయమానఃపండితంమన్యమానోయోవిద్యయాహన్తియశః
పరేషాం
తస్యాంతవంతశ్చభవంతిలోకానచాస్యతద్బ్రహ్మఫలందదాతి
చత్వారికర్మాణ్యభయంకరాణిభయంప్రయచ్ఛంత్యయథాకృతాని
మానాగ్నిహోత్రముతమానమౌనంమానేనాధీతముతమాన
ఇతిదద్యామితియజఇత్యధీయఇతివ్రతం [యజ్ఞః

ఇత్యేతానిభయాన్యాహుస్తానివర్జ్యానిసర్వశః॥

• తపము, దానము, శమము, దమము, లజ్జ, అకపటము, సర్వభూతదయ, ఈయేడు స్వర్గద్వారములు. తామసులు గరువమునఁ జెడుదురని సుజను లెప్పుడును జెప్పుదురు. చదువుకొనుచు, నేఁ బండితుఁడ ననుకొనుచు, మోహమున నితరపండితుల కీర్తి మాపువాని కుత్తమలోకములు లేవు. ఆవేదము నట్టివానికిఁ జెప్పఁబడినఫల మీయదు. అగ్నిహోత్రము, మౌనము, అధ్యయనము, యజ్ఞము ఈనాలుగును 'ఇంత హోమము చేసెదను. ఇంతవఱకు మాటాడను. ఇంత చదివెదను. ఇంత యిచ్చెదను. అనునియమముతోఁ జేయరాదు. అట్టినియమము భయకారణముగాని క్షేమదాయకము గాదు. మానరహితముగా హోమమానాధ్యయనదానములు చేసినచో నవి యభయ మొసంగును.

ఈప్రమాణమువనుసరించి మానాగ్నిహోత్రము, మానాధ్యయనము మానమానము మానయజ్ఞము నాన్ ఇవినాలుగును నియతార్థములు=నిషిద్ధకార్యములు, భయప్రదములు అని యర్థ మూహింపవలయును.

## చతుర్థాశ్వాసము.

6 క. బాలహరిణములఁ బట్టెడు
లీలను విషమాటవీచలిత కేసరిశా
ర్దూలేభ శరభములఁ దన
బాలత్వమునంద యెగచి పట్టుచు మఱియున్.

దుష్యంతునిబాల్యమును వర్ణించునీపద్యమునకు మూలము లేదు. ఇట్టిది భరతునిబాలక్రీడాభివర్ణనమునందుఁ గలదు.

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రిస్మరువరాహవ్యాళశార్దూలఖ
డ్గమదేభాదులఁ బట్టి తెచ్చి ఘనుఁ డైకణ్వాశ్రమోపాంతభూ
జములం దోలిన కట్టుచుం బలిమిమై శాకుంతలుం డొప్పె వ
న్యమదేభంబుల నెక్కుచుం దగిలి నానాశైశవక్రీడలన్.

7 క. ఉర్వీరుహనివహముతోఁ
బర్వతములు నెఱికి యొండుపర్వతములపైఁ
బర్వఁగ నైచుచు యావన
గర్వంబున నొప్పె నుర్విఁ గడు నధికుం డై.

సం॥ సచాద్భుతమహావీర్యో । వజ్రసంహననోయువా
ఉద్యమ్య మందరం దోర్భ్యాం । వహేత్సగిరికాననమ్॥

ఈశ్లోకమున కాయాంధ్ర మెట్లున్నదో యరయునది.

22 సీ. శ్రవణసుఖంబుగా సామగానంబులు
సదినెడుశుకములచదువు దగిలి
కదలక వినుచుండుకరులయుఁ గరికర
శీతలచ్ఛాయఁదచ్ఛీక(రం)రాంబు
కణముల చల్లనిగా డ్పానపడి వానిఁ
జెంది సుఖం బున్నసింహములయు
భూసురపరివరులు భూతబలుల్ దెచ్చి
పెట్టునీవారాన్నపిండతతులు
గీ. గడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు
చున్నయెలుకలపిల్లులయొండుసహజ
వైరిసత్వంబులయు సహవాస మపుడు
సూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది.

కరులయు సింహములయు సహవాసము, ఎలుకలపిల్లులసహవాసము, అని సమన్వయించుకొనవలయును. 'సీ. అంగనాజనులయుత్తుంగ' అనుపద్యమునందువలెనే సమాసము. కరిసింహద్వంద్వమును మూషకమార్జాలద్వంద్వమును భిన్నమై తత్పురుషమగుట విశేషము.

40 కాళికచిత్తభీతి—దేవేంద్రునిమనస్సునకు భయమును

47 తనర జనకుండు సన్నపరిదాయును భయతాత్రిత
యును ననఁగ నింతులకు మువ్వ రొగిని నయిరి గురువు
లనఘ యుపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు
ననఁగఁ బురుషున కియ్యేవు రనయంబు గురువు లైరి.

సం॥ శరీరకృత్ప్రాణదాతా । యస్యచాన్నానిభుంజతే
క్రమేణైతేత్రయోప్యుక్తాఃపితరోధర్మశాసనే॥

జనకుఁడు, రక్షకుఁడు, పోషకుఁడు ననుమువ్వరు స్త్రీపురుషసామాన్యమునకుఁ బితలని చెప్పియుండ నన్నయ మూలమును బ్రకృతోపయోగమును జింతింపక నూత్నకల్పనము సేయుటకుఁ గారణ మూహ్యము.

78 చ. విమలయశోనిధీ పురుషవృత్త మెఱుంగుచునుండుఁ జూవవే
దములును బంచభూతములు ధర్మువుసంధ్యలునంతరాత్మయుఁ
యముఁడును జంద్రసూర్యులునహంబును రాత్రియునన్మహాపదా
ర్థములివియుండఁగా నరుఁడు దక్కొన నేర్చునె తన్నుఁ బ్రచ్చిలన్.

సం॥ ఆదిత్యచంద్రావనిలానలౌచ
ద్యౌర్భూమిరాపోహృదయంయమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభేచసంధ్యే
ధర్మశ్చజానాతినరస్యవృత్తమ్॥

మూలమునందు '1 భూమిః 2 ఆపః 3 ఆదిత్యచంద్రౌ, అనలః (తేజః) 4 అనిలః 5 ద్యౌః, అనిపంచభూతవిశేషనామములు గలవు. తెనుఁగునందుఁ 'బంచభూతము' లని సామాన్యనామమున వానినన్నింటిని సంగ్రహించి తేజోవిశేషనామము లగుచంద్రసూర్యుల మాత్రము మఱల స్వీకరించుటకుఁ గారణము చింత్యము. మఱియు వేదములు సాక్షు లనుటకును బ్రమాణ మగపడదు.

96 ధాత్రీతలనాథ యింతధర్మేతరనే

'ధర్మేతర' అనవలయును. ధర్మాదనపేతా + ధర్మ్యా ధర్మ్యాయా ఇతరా + ధర్మ్యేతరా.

ఉద్యోగపర్వమునందు :—

మ. బకవిధ్వంసిజటాసురాంతకుహిడింబప్రాణపారీణుఁ గీ
చకనిర్మూలనకేళిలోలునసమరోత్సాహైకశీలప్రవ
ర్తకునాగాయుతసామ్యకీర్తితబలోదగ్రుంబ్రతివ్యూహదా
హకుభీముంగొనివచ్చుధర్మజుఁడుబాహాటోపముంజూపఁగన్.

ఈపద్యమును 'వికచ్రభ్రూకుటిఘోలఫాల' అనుపద్యమును తీసివేసి ఆచోటవేయుడు. క్రిందవ్రాసినవివరములో 'బకవిధ్వంసిజటాసురాంతకుమున్నగు' అనికూడసవరింపుడు.

110 క. బలయుతులు నూటయిరువది
నలువురుసుతు లుద్భవిల్లి నానాదేశ
మ్ములకుఁ బతులైరి మఱి వా
రలలో సంవరణుఁ డఖలరాజ్యోన్నతుఁ డై.

'నూట' ననునది కళ గాదు గావున 'నూటయిరువది' యని యడాగమము చేయఁ జనదు. 'అఖిల రాజోన్నతుఁ డై,' యనిసవరించిన చో బాగుగా నుండును.

136 చ. అనినఁ బ్రతీపుఁ డిట్లనియె నంబురుహానన యగ్నిసాక్షికం
బునఁ బరిణీతవైనసతి

'అగ్నిసాక్షికంబుగఁ బరిణీత' అని క్రియావిశేషణముమీఁద 'కన్' అనుతుమున్నంత ముఁ గూర్చుట సార్వత్రిక మీయియుండఁ బ్రాసప్రయోజన మగునిందలి 'న' వర్ణక ప్రయోగము విశేషము.

149 తనయుఁ డష్టముండు దల్లిదండ్రుల కతి
ప్రీతియును ముదంబు పెరుఁగుచుండ.

'ముత్ప్రీతిఃప్రమదోహర్షః' అని యమరము. ప్రీతికి ముదమునకు భేదము గానరాదు.

155 చ. అతులతపంబున న్వరుణుఁ డన్మునిచే బహుపుణ్యకర్మసు
స్థితిఁ బ్రభవింపఁగాఁబడినదివ్యమునీంద్రుఁ డశేషలోకపూ
జితుఁడు—

ప్రభవించు=పుట్టు, అకర్మకము. పుట్టఁబడ్డ, ఉండఁబడ్డ, అనుగాప్రయ్యరూపముల

వలెఁ 'ప్రభవింపఁగాఁబడిన' అనునదియుఁ గర్మార్థకముగాఁ బ్రయోగింపఁబడుట సుష్ఠుగాఁ లేదు. 'న్యాయ్యాత్పథః ప్రవిచలంతిపదంనధీరాః' అనుచోట నకర్మక మగుచలధాతువునకు 'పదమ్' అనుకర్మము ప్రయోగింపఁబడియుండఁ 'జాలయంతి' అని ప్రేరణార్థము చెప్పుకొనినరీతిని 'ప్రభవించు=పుట్టించు, కను, అని చెప్పి సాధింపవచ్చును.

182 ఎవ్వనియేనివీర్యంబున నిక్కన్య యుద్భవిల్లె నట్టియుపరిచరుండు.

'ఏని' పదమును గద్యమునందును వాక్యాలంకారముగావాడుట భట్టారకునకుఁ బ్రియము.

ఉ. ఇమ్ముగ సర్వలోకజను లెవ్వనియేనిముఖామృతాంశుబిం
బమ్మున నుద్భవంబయినభారతవాగమృతంబుఁ గర్ణరం
ధ్రమ్మునుసంజలిం దవిలి త్రావుదు రట్టిమునీంద్రలోకవం
ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లికరంబుభక్తితోఁ
ఆదిపర్వము.

ఇత్యాదిపద్యములందు 'నేని' పదము వాక్యాలంకారముగానే ప్రయోగింపఁబడినది. మఱియుఁ బైపద్యము నప్పకవి తిమ్మకవి మొదలగులాక్షణికులు సంయుక్తమకారము నకును బూర్ణబిందుపూర్వకబకారమునకును బ్రాసము చెల్లునని ప్రమాణముగాఁ జూపి యున్నారు. తద్విరుద్ధముగఁ గొందఱు 'ఇమ్ముగ' అనుదానికి 'ఇంబుగ' అను రూపాంతర మున్నదని ప్రాసమును మార్చుట యుచితముగ లేదు.

183 క. విను మైనను సాపత్న్యం
బనుదోషము గలదు గాన నదియును నీచే
తన సంపాద్యము నీ వలి
గిన నడ్డమె పురహరాజకేశవు లైనన్.

సంపాద్యము=పరిహరింపఁ దగినది యని ప్రసిద్ధి విరుద్ధార్థముచేయుట యావశ్యకము. ఈయర్థమును గవియే ముందటిగద్యమునందు వివరించెను.

184 ఆక్రోశం బెట్లు పరిహృతం బగు నట్లు—

215 ... అతనికిఁ బరలోక
విభుల శాస్త్రదృష్టి వెలయఁజేసె.

నాపగాతనూజుఁ డఖిలబాంధవులయు
బ్రాహ్మణులయుఁ దోడభానునిభుఁడు.

భీష్ముఁడు శాస్త్రదృష్టి వెలయ నఖిలబాంధవులతోడను బ్రాహ్మణులతోడను బరలోక విధులఁ జేసెనని యన్వయము. షష్ఠీసమాసపదములే కాక ప్రాతిపదికములు ప్రత్యయములును బదాంతరవ్యవహితములుగాఁ బ్రయోగించుట నన్నయ కభిమతము.

228 క. పతిహీను లయినభామిను
లతిధనవతు లయ్యుఁ గులజ లయ్యును ననలం
కృత లయ్యెడు మాంగల్యర
హిత లయ్యెడుఁ గృపణవృత్తి నిదియు మొదలుగాన్.

భామినులు మాంగల్యరహిత లయ్యెడు, శాపాద్యర్థక మగు నెడువర్ణకము గలధాతువు సర్వపురుషములందును వచనములందును మార్పుఁ జెందదు.

285 బలి సుధేష్ణనియోగించిసదీర్ఘతముండును దాని యంగము లెల్ల నంటి చూచి వంశకరుండును మహాసత్త్వుండును నయ్యెడుకొడుకు నీకుం బుట్టు నని యనుగ్రహించిన దానికి నంగరా జను రాజర్షి పుట్టె.

“ బలిస్సుధేష్ణాం స్వాంభార్యాం తస్మైసప్రాహిణోత్పునః
తాం సదీర్ఘతమాంగేషు స్పృష్ట్వా దేవీమథాబ్రవీత్
భవిష్యంతి కుమారాస్తే తేజసాదిత్యవర్చసః
అంగోవంగఃకళింగశ్చ పుండ్రస్సుహ్మశ్చతేసుతాః
తేషాం దేశాస్సమాఖ్యాతా స్వనామకథితాభువి
అంగస్యాంగోభవద్దేశో వంగోవంగస్యచస్మృతః
కళింగవిషయశ్చైవ కళింగస్యచ సస్మృతః
పుండ్రస్య పుండ్రాఃప్రఖ్యాతాఃసుహ్మాఃసుహ్మస్యచస్మృతాః
ఏవంబలేః పురావంశః ప్రఖ్యాతోవై మహర్షిజః ”

బలికి నంగవంగకళింగపుండ్రసుహ్ము లనుకొడుకు లేవురు పుట్టిరి. వారి పేరులు దేశములు

వారిపేరులతోనే ప్రసిద్ధము లయ్యెను. మూలవిరుద్ధముగ నంగరా జనుకొడు కొకరుఁడు పుట్టెనని నన్నయ యేల తెలిఁగించెనో ?

237 సత్యవతి తొల్లి కొండొకనాఁడు తనకన్యయయి యున్న కాలంబున—

కొండొకనాఁడు=బాల్యమునందు. క. అకటకట యుత్తరుఁడు కొం, డొక కాం భోజుండునుం గడుం బాలుఁడు. 'కొండిక' యను నికారమధ్యరూపము వాడుక లో నున్నదిగాని మృగ్యము. 'తనకన్యయయియున్నకాలంబున' పదద్వయవ్యవహితషష్ఠీ తత్పురుషము.

248 చ. అవని యరాజకం బయినయప్పుడ భూప్రజలందు సర్వధ
ర్మవులుదొలంగు దేవమునిముఖ్యులువాయుదురోలి, వృష్టి లే
దవుమఱి యర్థువు ల్దఱుఁగు నందురుగావునఁ గాలయాపనం
బవితథవాక్య ! చేయకరయంబునరాజ్యమునిల్పుమిత్తఱిన్

అకారాంతము లగునర్మధర్మశబ్దములును నకారాంతకర్మశబ్దమును నుకారాంతములుగను వువర్ణకాగమము గలవిగను సృజించుట కేమియాధారము గలదో ? ఆదిశేషువు లాలకిం చుచున్నవి, 'ఈరీతువుగా' ననికొని లోకసిద్ధము లగురూపములు గలవుగాని యవి గ్రాంథికములు గాఁ గనఁబడవు.

252 మధ్యాక్కర.

అవసరజ్ఞుం డయివ్యాసుఁ డే తెంచె నంత నత్రపసి
కవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులును
దవినయన్నువనల్లనై నడీర్ఘవుందనువును జూచి
యువిద కన్నుంగవ మొగిచి తెఱవక యుండె భయమున.

సం॥ తస్యకృష్ణస్యకపిలాజటాదీప్తేచలోచనే
బభ్రూణిచైవశ్మశ్రూణిదృష్ట్వాదేవీన్యమీలయత్॥

కవిల=పచ్చని, కపిలశబ్దభవము. వకారప్రాసము గనుక కవిలగడ్డ మనియే కవి వ్రాసి యుండునని తోఁచెడిని. ఇందే కపిలగడ్డము మున్నగుపాఠమున వపల కభేద ప్రాస మంగీకరించి యివి యనింద్యగ్రామ్యము లని యొకానొకఁడు చెప్పెను.

270 జన్మంబు మొదలుగాఁ బండ్రెండువత్సరమ్ములు దాఁటునంతకుఁ బురుషుండు బాలుండు వాఁ డెద్ది సేసినఁ బాపమ్ములం బెద్ద పొరయండు. వానికి నొరు లెగ్గుసేసినఁ బాతకు లగుదురు.

సం॥ ఆచతుర్దశకాద్వర్షాన్న భవిష్యతి పాతకమ్
పరతఃకుర్వతామేవదోష ఏవ భవిష్యతి॥

పదునాలుగవయేఁటిదనుక బాలురకుఁ జెడుపనులవలనిఫలము లేదు (ఆపాపము కుమారుని శిక్షింపనితలిదండ్రులకుఁ గలుగు నండ్రు) పైవయసునందుఁ జేయుపాపముఁ గర్తలే యనుభవింపవలయు నని మూలార్థము. పదునాల్గువత్సరములదనుక ననుమూలమునకు విరుద్ధముగఁ బండ్రెండేండ్లని తెలిఁగించుటకుఁ గారణము చూపట్టదు. మఱియుఁ 'బర్వతఃకుర్వతామేవ' యనునుత్తరార్థమునకు నన్నయ విపరీతార్థముఁ జేసికొన్నట్లును గానఁబడును.

## పంచమాశ్వాసము.

5 అంబికేయుం డైనధృతరాష్ట్రు రాజ్యాభిషిక్తుం జేసి భీష్ముండు దనకు విల్లును విదురుబుద్ధియు సహాయమ్ములుగా రాజ్యంబు రక్షించుచున్నంత.

సం॥ ధృతరాష్ట్రస్త్వచక్షుష్ట్వా ద్రాజ్యంన ప్రతిపద్యత
పారశవత్వాద్విదురో రాజాపాండుర్బభూవహ॥

'అంధుం డగుట ధృతరాష్ట్రుండును, శూద్రాపుత్త్రుం డగుట విదురుఁడును రాజ్యము నందరైరి; పాండువు రాజయ్యెను. దీనిచేఁ బాండుఁడు రాజగుట ఋషిప్రోక్తమైనను నన్నయ కిస్వాతంత్ర్య మేమి?

6 కుమా। రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె—

కుమారాయిత=కుమారస్వామివంటివాఁడు. యప్రత్యయమును రేఫోత్తరాకారమునకు దీర్ఘమును వచ్చినవిగాని 'ఆయిత' యనునది ప్రత్యేకశబ్దముగాదు. కనుక నిది యఖండయతి గాదు. విశ్వామిత్రశబ్దమునందు సవర్ణదీర్ఘభ్రమమున నైన ప్రయోగము ననుసరించి యవైయాకరణుఁడుబోలె నప్పకవి యుభయయతులలోఁ జేర్చుట యనుచితము.

7 రాజ్యంబు సేయుచు నారూఢయౌవనుం డైనధృతరాష్ట్రునకు,

12 దానితోఁబుట్టినకన్యకల సత్యవ్రతయు సత్యసేనయు సుధేష్ణయు సంహితయుఁ దేజశ్శ్రవయు సుశ్రవయు నికృతియు శుభయు సంభవయు దశార్ణయు ననుపదుండ్రి నొక్కలగ్నంబున వివాహంబయి

13 క. కులమును రూపము శీలము
గలకన్యలఁ దెచ్చి తెచ్చి గాంగేయుం డీ
సలఘుఁడు ధృతరాష్ట్రుఁడు కుల
తిలకుండు వివాహమయ్యె దేవీశతము౯.

దీనికంతకు సంస్కృతము గనఁబడదు.

14 తే. గీ. అంగములలోన మే లుత్తమాంగ మందు
నుత్తమంబులు కన్నుల యుర్విజనుల
కట్టికన్నులు లేవను టంతెకాక
యుత్తముఁడు గాఁడె సద్గుణయుక్తి సతఁడు.

ఇట్టివాని కింక నూటనెనమండ్ర నన్నయభట్టారకుఁడేల పెండ్లిచేసెనో!

15 సీ. వేదమ్ములందుఁ బ్రవీణుఁడై మఱి సర్వశా
స్త్రములందుఁ గౌశలము మెఱసి
యసికుంతకార్ముకాద్యాయుధవిద్యల
యందు జితశ్రముఁ డై తురంగ
సింధురారోహణశిక్షల దక్షుఁ డై
నీతిప్రయోగము ల్నెఱయ నేర్చి
యతిమనోహరనవయౌవనారూఢుఁ డై
కడలేనిహిమరశ్మికాంతి దాల్చి

ఆ. గీ. పెరుఁగుచున్నకొడుకుఁ బృథువక్షు నాయత
బాహు దీర్ఘదేహుఁబాండుఁ జూచి
వీనివలనఁ గులము వెలుఁగునంచును వేడ్క
జాహ్నవీసుతుండు సంతసిల్లె.

సం. సంస్కారైస్సంస్కృతాస్తేతు తపోధ్యయనసంయుతాః
శ్రమవ్యాయామకుశలా స్సమపద్యంతయావనమ్
ధనుర్వేదేచ వేదేచ గదాయుద్ధేసికర్మణి
తథైవగజశిక్షాయాం నీతిశాస్త్రేషుపారగాః
ఇతిహాసపురాణేషు నానాశిక్షాసుబోధితాః
వేదవేదాంగతత్త్వజ్ఞాస్సర్వత్రకృతనిశ్చయాః.
పాండుర్ధనుషివిక్రాంతో నరేష్వభ్యధికోభవత్
అన్యేభ్యోబలవానాసీ ధృతరాష్ట్రోమహీపతిః
త్రిషులోకేషుసత్వాసీ త్కశ్చిద్విదురసమ్మితః
ధర్మనిత్య స్తథారాజన్ధర్మేచపరమంగతః.

మువ్వురు వేదశాస్త్రాద్యధ్యయనము వ్యాయామము ధనుఃకౌశలము రథాద్యారోహణ చాతురి గలవారు. పాండుండు వింట నసదృశుఁడు. ధృతరాష్ట్రుఁడు బలమున సర్వాధికుఁడు. విదురుఁడు సాటిగాననిధార్మికుఁడు.

తెలుఁగున సర్వము పాండుపరమె చేసి, యనంతచంద్రసౌందర్యమును వర్ణించి, భీష్ముఁ డీమహాపురుషుఁడు వంశప్రకాశకుఁ డని తనిసెనని నన్నయపలికె. ఈమార్పునకుఁ గారణ మేమో తెలియదు.

34 సీ. యదుకులవిమలపయఃపయోనిధి సుధా
కరరేఖఁ గమనీయకాంతినిలయ
ననవరతాన్నదానాభితర్పిత——

నిలయశబ్దము పుంలింగము గావునఁ 'గాంతినిలయమును' అని యుండఁ దగు. దేవముఖుఁడు, కులతిలకుఁడు, కాంతినిలయ, ఇత్యాద్యబహువ్రీహులకు విశేష్యలింగత యవిచారితరమణీయము.

38 మ. ధ్వజినీపాతభరంబునం జెదరఁగా ధాత్రీధరాహీంద్రమూ
ర్ధజరత్నప్రకరంబు లున్నతగజేంద్రస్యందనప్రోల్లస
ద్ధ్వజవాతాహతిఁ దూలఁగా జలదబృందం, బీక్రియ న్సర్వది
గ్విజయార్థం బరిగెం గురుప్రభుఁడు దోర్వీర్యప్రకాశార్థియై.

ఈమనోహరమైనపద్యమున 'ఈక్రియన్' అనుపదము పొనకమునఁ బుడుకరైనది.

107 ధృతరాష్ట్రునకు వైశ్యాపుత్త్రిం దైనయుయుత్సుండు పుట్టె.

ధృతరాష్ట్రునకు వైశ్యయందు యుయుత్సుండనుపుత్త్రుండు పుట్టె నని రచింపవలసి యున్నది. పుట్టకమునుపు వైశ్యాపుత్త్రిఁ డనుట పొసఁగదు గదా! ఈయర్థము మూలమునందిట్లున్నది.

సం. గాంధార్యాంక్లిశ్యమానాయాముదరేణవివర్ధతా
ధృతరాష్ట్రంమహారాజం వైశ్యాపర్యచరత్కిల
తస్మిన్సంవత్సరేరాజన్ధృతరాష్ట్రాన్మహాయశాః
జజ్ఞేధీమాంస్తతస్తస్యాంయుయుత్సుఃకరణోనృప.

గాంధారి వర్ధమానగర్భక్లేశయయి యుండ ధృతరాష్ట్రున కొకవైశ్య పరిచర్యచేసెను. ఆయేఁట ధృతరాష్ట్రునివలన నామెయందు యుయుత్సుఁ డనుకొడుకు పొడమె.

124 సీ. విను కార్తవీర్యుకంటెను వీరుఁ డగుట
నర్జుననామ మీతండ యొనరఁ దాల్చు
నీతండ యనిఁ బురుహూతాదిసురుల
నోడించి ఖాండవము దహించు బలిమి
నీతండ నిఖిలావనీతలేశుల నోర్చి
రాజసూయమున ధర్మజుని నునుచు
నీతండ వేల్పులచేత దివ్యాస్త్రము
వడసి విరోధులనోడుచుఁ గడిమి
ఆ. గీ. ననుచు నవపయోదనినదగంభీరమై
గగనవాణి యెసఁగె గగనవీథిఁ

గురిసెఁ బుష్పవృష్టి సురదుందుభిధ్వను
లెసలఁగె సకలభువనవలయ మద్రువ.

ఈసర్వప్రాసనీసమున 'రాజసూయమున ధర్మజుని నునుచు' ననుచోట యతికూడ నుండినను దీర్ఘహ్రస్వపూర్వత్వము ప్రాసనియమభంజకముగా నున్నది. గీతమున గగనపౌనరుక్త్యము ప్రాసనియమరక్షణార్థమె యాదరింపఁ బడినది.

129 ఉ. పోరచి యాఁడుపుట్టువునఁ బుట్టి నిరర్థకజీవ నైతి.. పోరచి= వ్యర్థము.

135 సీ. మృగశాపభయమున జగతీశుఁ డప్పాండు
పతి శతశృంగపర్వతమునందుఁ
బత్నీసమేతుఁడై యత్నంబుతో ఘోర
తప మొనరించుచు విపులశక్తి
నమరవరప్రసాదమున ధర్మస్థితిఁ
గొడుకుల నేవురఁబడసె ననియు
విని వసుదేవుండు మనమున హర్షించి
యనుజను మఱఁదిని ఘనుఁడుసూడ
గీ. తనపురోహితుఁ గశ్యపుఁడనుమహాత్ము
బ్రీతిఁ బుత్తెంచె నవ్విప్రుచేత భాగి
నేయు లగుకుమారులకు నమేయరత్న
భూషణావళు లిచ్చివిశేషలీల.

136 వ. అక్కశ్యపుండును జనుదెంచి పృథామాద్రిసహితుం డయి యున్నయప్పాండురాజుఁ గని వసుదేవుసందేశంబు చెప్పి కుమారులకుం గ్రమంబునఁ జౌలోపనయనమ్ము లొనరించి వేదాధ్యయనంబు సేయించుచున్నంత.

వసుదేవుఁడు కశ్యపునిచేఁ గానుక లంపుట మొదలయినవృత్తాంతము సంస్కృతమున నదృష్టము.

137 ల. కమ్మనిలతాంతములకు మ్రొనసి—

లతాంతములకున్ + మొనసి, నకారమునకు మకార మాదేశ మగును. దీనినే యను నాసికపాస మందురు.

163 క. కలచునెడ నేయునెడ వడిఁ
బలచునెడం బెనఁగునెడ నపారబలమ్ముల్
మెలయునెడ భీమునకు నం
దొాలు గీడ్పడఁ ద్రొడఁగి యుద్ధతులు రాజసుతుల్.

కలచు=నేచు, మెలయు=మెలయించు, అంతర్భావితణ్యర్థము. 'అందొాలు' అను 'ఒ' కారమధ్యమునకు యతిప్రమాణము.

175 పాప! వ్యవసాయులచెయ్యువ అర్థవంతము లగునే-

చెయ్యువలు=చెయ్యువలు, పనులు.

199 చ. కలధనమెల్ల ముందర జగన్నుతవిప్రుల కిచ్చి వార్థిమే
ఖలనిఖిలోర్వినంతయును గశ్యపుఁ డన్ముని కిచ్చితిన్.

నిఖిల, అంత, ఈరెండింటి కపౌనరుక్త్య మూహ్యము.

200 శస్త్రాస్త్రములు—

శస్త్ర=ఆయుధములు, అస్త్ర=సమంత్రములు, అస్త్రశస్త్రము లనియుండవలసినను బూర్వనిపాతమున కనిత్యత యాశ్రయింపఁబడెను.

202 చ. కొలఁదిమెఱుంగ కిట్టిపలుకు ల్పలుకం దగఁగాదు నాక
నన్ బలుచదనంబునం బలుకఁ బాడియె నీసఖి నంచు—

'సఖి నంచు—సఖు డంచు' అని యుండవలయును. సఖి, స్త్రీలింగము, సఖిశబ్దము హరిశబ్దమువలె నికారాంతమయినను 'కృష్ణసఖుఁడు' అనుతత్పురుషమునందు బలెఁ బుంలింగమునందు 'సఖుఁడ' నియె కనవచ్చును.

206 ఆ. గీ. నీరిలోనఁ దోఁచుతారకప్రతిబింబ మొక్క—

ఔపవిభక్తికములు వైకల్పికములుగాన 'నీటిలోన' ననియు నుండును.

217 మత్తకోకిల. వేఁడినన్ ధనమీయఁడేనియువీనిమాత్రనునాలుగే
న్బాఁడికుఱ్ఱులనీఁడె వీనికిఁబాలుద్రావుచునుండఁగన్.

నాలుగు పాఁడికుఱ్ఱులు నేని, వీనిమాలఁ నీఁడె యని యన్వయము. మాత్రము=కొలఁదిని కుఱ్ఱి, కుఱ్ఱులు=ఆవులు.

255 క. వెఱచఱవ నీటిలో నొ
కెక్కుఱగా నొకమొసలిచూడ్కికి నగోచరమై
పఱతెంచి కుంభసంభవు
చెఱుతొడ వడిఁబట్టుకొనియె శిష్యులు బెదరన్.

వెఱచఱచు=భయపడు. దీనికిఁ గర్త ద్రోణుఁడా? ఒకెక్కుఱ=భయంకరము, బెదరు=వెఱచు.

సం. కస్యచిత్త్వథకాలస్య సశిష్యోంగిరసాంవరః
జగామగంగామభితో మజ్జితుంభరతర్షభ
అవగాఢమథోద్రోణం సలిలేసలిలేచరః
గ్రాహోజగ్రాహబలవాన్ జంఘాంతేకాలచోదితః
ససమర్థోపిమోక్షాయ శిష్యాన్సర్వానచోదయత్
గ్రాహంహత్వామోక్షయధ్వం మామితిత్వరయన్నివ.

సంస్కృతము నిర్భయముగా నుండఁ దెలుఁగు త్రిగుణభయముగా నున్నది.

షష్ఠాశ్వాసము.

4 అంగీకృతపూర్వోత్తరప్లవము=తూర్పున కుత్తరమునకునీరుపోవునది.

11 సీ. హయమదద్విరదరథారూఢదక్షతఁ బ్రకటించువారును—

'రథారూఢిదక్షత' అనినచో స్పష్టముగా నుండును.

గీ. రాజసుతులతోడ రమణఁ బాండవధృత
రాష్ట్రసుతులు వృద్ధరాజులొద్ద—

రాజులయొక్క—యొద్ద. షష్ఠీతత్పురుషమునం దకారమునకు సంధి.

17 చూపఱు=చూచువారు. నిత్యబహువచనాంతము.

35 క. అనిన విని పార్థునకు ని
ట్లనియె నినాత్మజుఁడు దుర్బలాశ్వాసనిబం

ధనములు వలుకకు
ఘననిశితాస్త్రములఁ బలుకఁగడఁగుము నాతోన్.
సం. కింక్షేపైర్దుర్బలాయాసైః శ్శరైః కథయభారత

38 సీ. శూరులజన్మంబు సురలజన్మంబును
నేరులజన్మంబు నెఱుఁగ నగునె?
సం. శూరాణాంచ నదీనాంచ దుర్విదాఃప్రభవాః కిల

75 క. కరిఘటలఁ దాఁకి భీముఁడు
కరటిఘటాకుంభబింబకమ్ముల వడి జ
ర్జరితములఁ జేసె నిష్ఠుర
తరవజ్రనిపాతపటుగదాఘాతములన్.

కరిఘటల, కరటిఘటా, ఈరెండింటికిఁ బౌనరుక్త్యము గలిగినది.

77 చ. అనిలజుఁ డుగ్రుఁడై ద్రుపదుహస్తిఘటావలి.—

ఘటా + ఆవలి. ఈరెండిటిలో నొకటి వ్యర్థము.

80 క. కడఁగి ద్రుపదానుజుఁడు నె
వ్వడిఁ గస్వడి నేసె నూటువాఁడిశరమ్మల్—

'శరములన్' అని యుండఁదగును. బాణములతోఁ గొట్టెనని యర్థము. ఏయుధాతువు ద్వికర్మకము గాదుగదా?

88 క. వీరెవ్వరయ్య ద్రుపదమ
హారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికివలసెనె యిపుడు మ
హారాజ్యమదాంధకార మది వాసెనొక్కో.

పరిహాసమువందు బహువచనము భావపుష్టికై వాడఁబడినది. మూలమునం దేకవచనమే కలదు.

సం. విమృద్యతరసారాష్ట్రం పురంతేమృదితంమయా
ప్రాప్యజీవంరిపువశం సఖపూర్వంకిమిష్యతే

ఏవముక్త్వా ప్రహస్యైనం కించిత్సపునరబ్రవీత్
మాభైఃపార్థిణభయాద్వీర క్షమిణోబ్రాహ్మణావయం.

90 ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరు యావరాజ్యభారధురంధరుం గా నెఱింగి—

భార, ధురం, పునరుక్తములు. 'యావరాజ్యధురంధరు' ఇంతమాత్రమె చాలును.

98 నీవు నీబంధుసమక్షమ్మున నాకు గురుదక్షిణ యిమ్మది యెయ్యది యనిన 'నేను యుద్ధంబు సేయునపుడు నాతోఁ బ్రతియుద్ధంబు సేయకుండు' మిదియ నాకు గురుదక్షిణ యనిన నర్జునుండు వల్లె యని యాచార్యునకు నమస్కరించి దాని కొడంబడియె.

సం. ఆచార్యదక్షిణాందేహి జ్ఞాతిగ్రామస్యపశ్యతః
దదానీతిప్రతిజ్ఞాతే ఫాల్గునేనాబ్రవీద్గురుః
యుద్ధేహంప్రతియోద్ధవ్యో యుధ్యమానస్త్వయానఘ
తథేతిసప్రతిజ్ఞాయద్రోణాయకురుపుంగవః
ఉపసంగృహ్యచరణౌసప్రాయాదుత్తరాందిశమ్.

గురువని మోమోటపడి యర్జునుఁడు తనతో యుద్ధము సేయఁడేమోయని ద్రోణుఁడు రణకాంక్షచేఁ గిరీటిని దనతోఁ బ్రతియుద్ధము సేయఁగోరుట స్వభావము. ద్రోణుఁడు తనతోఁ బ్రతియుద్ధము సేయమానుమని కోరఁ గవ్వడి యందుల కంగీకరించుటయే నిజమగునేని యాప్రతిజ్ఞకు విరుద్ధముగా నుత్తరగోగ్రహణమునందు నష్టాదశదినపరిమిత మహాయుద్ధమునందును గిరీటి ప్రతియుద్ధ మేల సేయును? మూలమునకును యుక్తికిని విపరీతముగా నన్నయ యిట్లు తెలిగించుటకుఁ గారణము గానరాదు.

అంతదుర్యోధనుండు యుధిష్ఠిరుయావరాజ్యాభిషేకంబునకుభీమార్జునయములపరాక్రమంబునకు సహింపక కర్ణశకునిదుశ్శాసనులతో మంతనంబుండి యిట్లనియె.

99 సీ. ఆయుధవిద్యలయందు జితశ్రము
లనియును రణశూరు లనియు నంత

త్రోత్సాహు లనియు సత్యుద్ధతు లనియును
భయమందుచుందుదుఁ బాండవులకు
దానిపై నిప్పుడు ధర్మజు యువరాజుఁ
జేసె రా జేనేమిసేయువాఁడ
నృపనీతి మెయ్యదినిరతంబుగా దీని
నా కెఱింగింపుఁడు నయముతోడ
ననిన వినుచుఁ గణికుఁ డనువాఁడు సౌబలు
నాప్తమంత్రినీతులందుఁ గరము
కుశలుఁ డయినవాఁడు కురుకుల వల్లభు
నిష్టమునకుఁ దగఁగ నిట్టులనియె.

సం. తతోబలమతిఖ్యాతంవిజ్ఞాయదృఢధన్వినామ్
దూషితస్సహసాభావోధృతరాష్ట్రస్యపాండుషు
నచింతాపరమోరాజానన్రిద్రామలభన్నిశి
తతఆహూయమంత్రజ్ఞంరాజశాస్త్రార్థవిత్తమం
కణికంమంత్రిణాం శ్రేష్ఠంధృతరాష్ట్రో౽బ్రవీద్వచః
ఉత్సిక్తాఃపాండవానిత్యం తేభ్యో౽సూయేద్విజోత్తమ
తత్ర మేనిశ్చితతమంసంధివిగ్రహకారణం
కణిక? త్వంసమాచక్ష్వకరిష్యేవచనంతవ

ధృతరాష్ట్రుండు పాండవవృద్ధి సైఁపక కణికుం దనమంత్రి రావించిపలికె నని సంస్కృతము.

దుర్యోధనుండు ధర్మజు యౌవరాజ్యాభిషేకంబునకు భీమాదిపరాక్రమమునకు సహింపక కర్ణశకునిదుశ్శాసనులతో మంతనంబుండి నీతి యడుగ శకునిమంత్రి కణికుఁడు రాజు భావమున కనుకూలముగఁ బలికె నని తెలుఁగు.

117 చ. తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మఁగా
నొడివియు సత్యమిచ్చియుఁ జను ల్జననాథ కృతాపకారుల

న్గడఁగి వధింపఁగా ననుట కావ్యమతం బిదిగాన నెట్టులుం
గడుకొని శత్రులిలం జెఱుపఁ గాంచుటకార్యము రాజనీతిమై.

సం. హన్యాదమిత్రంసాంత్వేనతథాదానేనవాపునః
తథైవభేదదండాభ్యాంసర్వోపాయైఃప్రశాతయేత్.

ధృతరాష్ట్రఉవాచ. కథంసాంత్వేనదానేనభేదైర్దండేనవాపునః
అమిత్రఃశక్యతేహంతుంతన్మేబ్రూహియథాతథమ్.

కణికఉవాచ. శృణురాజన్యథావృత్తంవనేనివసతఃపురా
జంబుకస్యమహారాజనీతిశాస్త్రార్థదర్శినః
అథకశ్చిత్కృతప్రజ్ఞఃసృగాలఃస్వార్థపండితః
సఖిభిర్న్యవసత్సార్థంవ్యాఘ్రాఖువృకబభ్రుభిః.

నన్నయ, నక్క పులి యెలుక తోడేలు ముంగులకథను దెలిఁగింపక విడిచె.

ఆంధ్రవ్యాసభారతము.

క. చను నఱకడ నిడి మోవం
దనశత్రు నదనగునంతదనుక; న్నమయ
ము న్మన రాతఁ గుండ గొట్టిన
యనువునఁ గూల్చునది పేదయఱపు లఱచిన్. 1

ఆ. గీ. స్నైఁచి, విడువవలదు చంపనేవలయు సా
మాదులందుఁ గొన్ని యన్నియేని
పూని. నక్క యుండుఁ గాన, వ్యాఘ్రాఖున
కులవృకములతోడఁ జెలిమి గలిగి. 2

క. కని యవి వడిగలమెకముం
గొనఁజాలక, యరసె.వ్యాఘ్ర! కొట్ట స్దీని
న్బనివడితి పెక్కుదడవలు
గననే; బరువమును దెలివిగలది దొరకునే. 3

ఆ. గీ. ఇది పరుండఁ, గాళు లెలుక కొఱికి పుండ్లు
సేయఁ బట్టికొనుము. చేరి తింద
మందఱ.మనె నక్క.యట్లొనర్చిన, నేలఁ
బొరలుమేకము గాంచి, పొంగి మదిని. 4

ఆ. గీ. పలికె నక్క. మీకు భద్రము. నేఁ గాతు
మునిఁగి రండనంగఁ బోయి రేటి.
కరయుచుండె నందె యానక్క. పులివచ్చి,
ఘనుఁడ! వనట యేమి? తినెదమె? యన. 5

ఆ. గీ. వినుము శూర! యెలుకయనిన ప.ల్కిన్నిరో!
పులిబలంబు. నేఁడు పోవకుండ
నేనటంచు నుడివె. నేఁ దినఁగోర. నాఁ,
జనియె. నెలుకతోడ ననియె నిట్లు 6

ఆ. గీ. మునిఁగి, మేకముమాంసము దిన. నుందురుఁ దిందు
ననుమతింపు మనియె. ననిన, లాఁగ
నడఁగె నెలుక. వృకమునవె. నల్గె మృగరాజు
వచ్చె. నదిగొ. ననినఁ, బాఱెవృకము. 7

క. తోడేలు పోవ మునిఁగిన
తోడఁ బలికె నక్క. నిర్జితులు నాచేవాం.
క్రీడ్పైన, నీవు ననుఁబో
రాడి గెలిచి తినుము మాంసమభిమత. మనిన. 8

క. తెలివిగలయెలుక తోడే
ల్పులి నీచే గెలువఁబడిన, భూరిబలుఁడ. వేఁ
గలనికిఁ గడంగ నీతోఁ
బలికి యిటు, ల్పోవె నదియుఁ బరమప్రీతిన్. 9

తే. గీ. వంచకమొకండు దినెఁ గండఁ. బార్థివుండు
చేసి యిటు లెప్డు సౌఖ్యముఁ జెందుఁ బిఱికి
వెఱవఁగాఁ జేసి, శూరునివినతిఁ, బిసిని
దానమున. నమబలుహీనుఁదలఁగుఁగడిమి. 10

చ. తనుజుఁడు సోదరుండు చెలి తండ్రి గురుం డనరాదు వైరముం
బొనరుప, మేలుగోరికొనుభూపతి. యల్గియుఁ గానరాకయుం
డ, నగుచుఁ బల్కఁగావలయు. నాల్కకుఁ దేఁజనదప్రియంబు.కొ
ట్టునపుడు నశ్రుధారలు గడు న్బరఁగ న్వగవంగనే తగున్. 11

మ. తనదేశంబున నుండనీఁదగరు పేద ల్దొంగలు న్నాస్తికు.
ల్వినయమ్మం గడుఁ జూపఁగావలయు వాగ్వృత్తి; న్హృదింగత్తిపో
ల్కి. నమస్కారము సాంత్వము న్శపథము న్గృత్యమ్ములాశింపఁజూ
చినఁ జాల, న్బలహీనము న్ఫలితము న్జెట్టెక్కరాకుండదే. 12

క. ఆరీతి నుండఁదగు. గ
ర్వారూఢుఁడు గాక ప్రియములాడుచుఁ గనుచుం
బ్రారంభమ్ములు శుచిమతి
నారయఁజను ద్విజులతోడ నవధానమునన్. 13

క. మృదువో దారుణమో యె
య్యదొ తనపేదఱిమి నడఁప ననువైనక్రియం
బదిగ నొనరించి, సత్తువ
గదురఁగ, ధర్మం బొనర్పఁ గడఁగునది నరుల్. 14

క. సందేహముఁ జెందక, శుభ
మందఁడు మానవుఁడు సందియముఁ జెందినచో
బొందిని బ్రాణము లుండినఁ
బొందున, మే. ల్ఋషిముఖములపోలికఁ గనుఁడీ. 15

క. పగతునితోఁ గూడి కృతా
ర్థగతి న్నిదురించువాఁడు తరుశిఖరసుప్తు
ప్తిగతునికరణిఁ బడి మెలఁకు
వగను న్మంత్రంబుఁ గావవలయు న్బ్రాజ్ఞా. 16

క. చెలులకుఁ బగతురకేనియుఁ
దెలియ నశక్యముగఁ బనులుతీర్చునది భయ
మ్ములజడిరామిఁ బ్రతికి యి
వలయు న్నేయంగ నెడరువచ్చినపిదపన్. 17

క. అనలునివలెఁ దనుఁబ్రజ్వలి
తుని గావించుకొనువాఁడు ధూర్వహుఁడై వృ
ద్ధిని జెందుచు, రిపుసంచయ
మును నత్యంతపరివృద్ధమును జెడఁజేయున్. 18

తే. గీ. సర్వబలములుగలవాఁడు సమధికుండు
బలఘనులు పాండుతనుజులు వారివలనఁ
గలుగకుండఁగ నాపదఁ గావుసుతుల
వగవ మించినదానికి ఫలములేదు. 18

123 ఉ. లోకనుతుండు పాండుఁ డమలుండు మహాగుణరత్నపూర్ణర
త్నాకరుఁ డత్యుదారమతి

మహాగుణరత్నాకరుఁడు. అనినఁజాలును.

140 షోడశపంచదశ చతుర్దశ త్రయోదశ వర్ష జాతులు—

షోడశ, పం...వర్షాణిజాతానాం యేషాంషోడశ, పం...జాతాః. మాసోజాతస్య యస్యమాసజాతః, అనునట్లు విగ్రహము.

పుట్టుదొట్టి, పదియాఱవ—ధర్మరాజునకు, పదునేనవ—భీమునకు, పదునాల్గవ—అర్జునునకు, పదుమూడవ—నకులసహదేవులకు,
సంవత్సరముల వయసుగలవారు.

అయి,శతశృంగంబుననుండి హస్తిపురంబునకు వచ్చి యందుం గౌరవులంగలసి యస్త్ర విద్యలంగఱచుచుం బదుమూడేండ్లుండి

ఆంధ్రివ్యాసభారతమునందు—

సీ. పదునాఱు పదునేను పదునాల్గుపదుమూడు
నేఁడులప్పుడువచ్చిరిభనగరికి
ధర్మానిలేంద్రాశ్వితనయులు ధృతరాష్ట్రి
పుత్త్రిలతోఁ బదుమూడువత్స
రము లుండియాఱుమాసములకు లాక్షాగృ
హము విడి రేకచక్రమున నాఱు
నెలలుండి ద్రుపదునినెలవున నొక్కేఁడు
వసియించి మఱి హస్తిపట్టణమున

గీ. నైదువర్షము లుండిరి.యాంబికేయు
నాజ్ఞ ఖాండవప్రస్థమునందు మూడు
నిరువ, దడవుల నీరాఱు,పురినొకండు,
నిలిచి పోరాడి యేలిరినిఖిలవసుధ.

తే. గీ. ముప్పదాఱేఁడులో మహాభూప! యాఱు
నెలల నర్జునపౌత్రుని నృపతిఁ జేసి
కృష్ణభక్తులు దివికేగి రిట్లు నూట
నెనిమిదేం డ్లాయువు యుధిష్ఠిరునకు నృవర.

156 ఖనకుఁడు=త్రవ్వువాఁడు, సాభిజ్ఞాన=సహ+అభిజ్ఞాన=ఆనవాలుతోఁ గూడిన

163 కృతకవిభూతిజాతుషనికేతనమున్=కృత్రిమ (మాయిక) సంపదగలలక్కతోఁ గట్టఁబడినయిల్లు, జాతుష,వికారార్థకతద్ధితాంతము.ఇట్టిది తాత్రిపుషము,త్రపు=తగరము.

169 మఱిఁ బాండుకుమారులపం
చత విని దుర్యోధనుండు సంతసపడియె—

హితుఁ డయినపురోచనుపం
చత కెంతయు జాతదుఃఖసంచలుఁ డయ్యెన్.

మతిన్ సంతసపడియెన్ అని యన్వయము చేసికొనవలయును.

173 క. ధరణిదిశాపరిపూరిత
గురుతరకిరణంబు లొడిచికొని దీర్ఘనిరం
తరగతిఖిన్నుఁడ పోలెను
హరిదశ్వుఁడు విశ్రమించె నస్త్రాద్రిదరిన్.

'ఒడిసికొని' అని దిద్దవలయు. ఒడియు=లాగు. ఓడు. ప్రే. ఓడించు ఒడుచు.

176 క. త్రిభువనసామ్రాజ్యశ్రీ
ప్రభుఁ డగుధర్మాత్మజుండు ప్రాకృతజనునట్లు

ప్రాకృతజనునట్లు=సామాన్యమనుజుఁడువలె.

177 కటికినేలఁ గండ్లులొత్త—కల్లు. కండ్లు. కండ్లులు. బహువచనముమీఁద బహువచనము. నెమిళ్లులవలె. వాలుమెకములు=కూరిమృగములు.

182 జనరభసంబు దవ్వుల వీతెంచిన—రభసంబు=1 వేగము. 2 హర్షము. దీనికున్న యర్థము లనన్వితములు. శబ్దము, సందర్భవశము.

193 తమయిందుల నుండినయట్లు మెచ్చకే
మతిశయనింతురే

మెచ్చక=లక్ష్యపెట్టక. (హిడింబున్) అధ్యాహార్యము

212 ఉ. తూర్పరుణంబు గాఁదొడఁగె దుష్టనిశాచరవేళ యయ్యెదుర్
మార్పముకాలయాపన మమర్పక యప్పిశితాశిఁ బట్టిపా
లార్పఁగనేల నావుడుబలాఢ్యుఁడు భీముఁడు మల్లవిద్యనే
ర్పేర్పడఁగాహిడింబు బలహీనపరాక్రముఁ జేసెఁజెచ్చెరన్.

మార్పము=మాలు=నశించు. ప్రే. చంపుము. పట్టి, పాలార్చు=ఉపేక్షించు, బల=ఉక్కు, పరాక్రమ=బీరము, హీనబలపరాక్రము అని భావము చేసికొనవలయునా? యతికొఱకుహీనశబ్దము బల, పరాక్రమములనడుమకు వచ్చినదిగాఁబోలు!

:17 క. ఆపద యయినను ధర్మువ

పాపిపుగ రక్షింపవలయుఁ బరమార్థము ధ
ర్మోపాయము ధార్మికులకు
నాపద జన్మాంతరమున ననుగత మగుటన్.

ధర్మోపాయము అని దిద్దవలయు.

సం. వ్యసనం హ్యేవ ధర్మస్య, ధర్మిణా మాపదుచ్యతే.
ధర్మపరులకు ధర్మభంగమే యాపదగద

సంస్కృతమున, ఘటోత్కచునితో హిడింబ వీడ్కొనినపిదప బహుదేశములు దాఁటి యరణ్యసంచారము సేయుచుండ వ్యాసదర్శనము, ఏకచక్రాగ్రహారనివాసోపదేశమును గలదు. తెనుఁగున, హిడింబ, యనాగత మగుశాలిహోత్రసరోవనస్పతిసేవనము వ్యాసదర్శనముఁ జెప్పె ననియు నందుండఁ బారాశర్యమహాముని వచ్చి హిడింబకుఁ గమలపాలిక యనుపేరిడి దానికి బలవంతుఁడగుపుత్త్రుఁడు పుట్టు. మీకందఱ కాపదుద్ధారకుఁ డగునని యనాగత ముపదేశించినట్లు నున్నది.

222 క. ఇది పరమసాధ్వి దీనిని
మది నొండు దలంపవలదు.

ఒండు=అన్యను, ఊహింపరాదు. ఆత్మీయగానే తలఁపుము. ఇచట భీమునకుఁ బరివేత్తృత గనఁబడు. అన్న పెండ్లాడకుండఁ బెండ్లాడినతమ్ముఁడు పరివేత్త.

224 ఉ. పుణ్యతపోమయుండుమునిపూజ్యుఁడుబ్రహ్మసమప్రభుండుబ్రి
హ్మణ్యుఁడు ప్రావృషేణ్యజలదాసితవర్ణుఁ డశేషకిల్బిషా
రణ్యదవానలుం డగుపరాశరనందనుఁ డేగుదెంచె ద
త్పుణ్యఫలస్వరూపుఁడునుబోలెఁ గరంబుమనోముదంబుగన్.

పుణ్యతపోమయుండు=పాపహర మైనయుపవాసాదినియమమే స్వరూపము గలవాఁడు. జ్ఞానానందమయమ్ అనునట్లు మయట్ప్రత్యయము ప్రాచుర్యార్థకము. అట్టినియమము హెచ్చినవాఁడు. బ్రహ్మణ్యుఁడు=వేదములకు హితుఁడు. విభజించుటచేతను బురాణభారతస్మృతిసూత్రనిర్మాణమున వేదముల రక్షించినవాఁడు. అనలుఁడు=అగ్ని. మహద్వివత్తు, అనలము, అనవచ్చు. సముద్రుఁడు, సముద్రమునువలె. తత్పుణ్యఫలస్వరూపుఁడు=అపాండవులు చేసికొన్నసుకృతమువలనఁ బుట్టినతనువు గలవాఁడు, మనోముదంబు కరంబు కాన్. పరమానందము కలుగ. ఎవరికి. పాండవులకు, ఇట్టి

యుల్థితాకాంక్షములు, తత్పుణ్యాదిపదములు సమాప్తపునరాత్తదోషగ్రస్తములుగావు.

230 చ. పవనసుతుండు నక్కమలపాలికచేత వినీతుఁడై మహా
ర్ణవవృతభూములం గలవనంబులు హంసబలాకసారసా
ర్ణవ

వినీతుఁడై యనుచో నుపసర్గ ముత్పాత మైనది. బలాక=కొంగ. పుంలింగ మరుదు.
సం. భీమసేనముపాదాయ

233 ఇమ్ముల బ్రహ్మచారివృత్తిని
వెలయఁగ నందుండి రొక్కవిప్రగృహమునన్

ఇమ్ముల=సుఖముగనుండిరి. ఈయర్థమునఁ దఱచుద్వితీయాబహువచనాంతమె.

234 భిక్షార్థము ప్రతిగేహమ్ములకు నరుగుభవ్యుల

ప్రతిగేహమ్ములు=ఇరుగుపొరుగిండ్లు. ప్రతివేశము వలెనెఱుంగునది.

236 క. పరమాన్నభైక్షభిస్సా
పరిపూర్ణతరమ్ములైన పాత్రిములు

క్షీరాన్నముతో, భైక్ష=మాధుకరవృత్త్యార్జితము, భిస్సా=అన్నము. రెండును మాధుకరముగనడింపఁబడినవే. భైక్షభిస్సాపరమాన్నపరిపూర్ణతరములు. అన్నమాటయే. క్షీరాన్నముమాత్రము స్వగృహపక్వమా?

239 అయ్యెంగావలయు. అగుట, ఊహ్యము. భావప్రధాన మాఖ్యాతము. వృష్టి లేదవు. వలె, లేమి అగుననియర్థము.

240 క. కృత మెఱుఁగుట పుణ్యము. స
న్మతి దానికి సమముసేఁత మధ్యము. మఱి త
త్కృతమున కగ్గలముగస
త్కృతిసేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్.

సత్కృతియనుచో నుపకృతి అనవిస్పష్టము.

244 క. అలసారము సంసార మ
ఖిలదుఃఖావహము భయనికేతన మతిచం

చలము పరాధీనం బిం
దుల జీవన మేల నమ్ముదురు తత్త్వజ్ఞుల్.
సం. ధిగిదం జీవితం లోకే గతసార మనర్థకం
దుఃఖమూలం పరాధీనం భృశ మప్రియభాగిచ.

అలసారము. అలధాతువు పచాద్యజంతము. గతపర్యాయము. గతసారము చేవలేనిది, (ఒండె) అలస + అర=చక్రోపమిత మైనజీవనమునకు విశేషణము. నేమిని నిలుపఁజా లనియాకులుగలది. నేమి=బండికంటికడకమ్మి. ఆకులయట్టిదారపుత్త్రాదులు భంగు రములుగా?

252 ఆ. గీ. సతి విముక్తయైనఁ బతికిఁ బునర్దార
సంగ్రహంబుసేఁత శాస్త్రమతము
పతి విముక్తుఁ డయిన సతికన్యపురుషసం
గ్రహము సేఁత లోకగర్హితంబు.
సం. నచాప్యధర్మః కల్యాణ బహుపత్నీకతా నృణాం
స్త్రీణా మధర్మ స్సుమహా న్భర్తుఃపూర్వస్య లంఘనే.

సంస్కృతమునకుఁ దెలుఁగు సరిగానున్నదో లేదో పరికింపుఁడు.

257 తే. గీ. తండ్రి చేయుతిలోదకదానవిధులు
వొందుఁ బరలోకగతమైనపుత్త్రియందుఁ
బుత్త్రి చేసినవిధులు దత్పురుషుఁగాని
తల్లిదండ్రులఁ బొందవు ధర్మయుక్తి.

దీనికి సంస్కృతము గానరాదు.

259 బాలకుం డొక్కరుం డొకకోల సేతఁ
బట్టికొని యేను రక్కసుఁగిట్టి చంపి
చులకవత్తు.

కిట్టు=చేరు, గిట్టు=చంపు.

267 క. అఱియని బ్రాహ్మణుచేతను

ధరణీశులు పోఁకయును మొదలుగాఁ గొన రె
ర్వారు నిప్పావుఁడు మానిసి
నరిగొనియెడుభక్షణార్థియై విప్రులచేత.

అరి=దే. పన్ను. సం. 1 శత్రువు 2 చక్రము.

269 మతి నవమానింపఁ గాదనిన విప్రుమరణంబు దలఁచు
టతిపాతకము పాతకములలోన బ్రాహ్మణహత్య పెద్ద

మతిన్=బుద్ధిపూర్వము. అవమానింపన్=తిరస్కరించుట, కాదు=నిషిద్ధము. అనిన=ఇట్లుశాస్త్రోక్తుఁడైన, విప్రు=బ్రాహ్మణునియొక్క అనియర్థము.

270 క. ధృతి సెడి వేఁడెడువానిని
నతిథిని నభ్యాగతుని భయస్థుని శరణా
గతుఁ జంపుట కొడబడుదు
ర్మతి కిహముం బరముగలదెమదిఁబరికింపక.
సం. ఆగతస్యగృహం త్యాగ స్తథైవ శరణార్థినః
యాచమానస్య చ వధో నృశంసో గర్హితో బుధైః

అతిథి=భోజనమునకు వేచువాఁడు, అభ్యాగత=భోజనకాలమునకు వచ్చినవాఁడు.

277 ఇతనిబల్మిని గాదె యెంతయు భీతులై ధృతరాష్ట్రినందను ల్ధృతియుఁదఱిఁగి.
నిద్రలేక తమకు నిలుచనుపాయంబు
లొండుదక్క వెదకుచున్నవారు
బలియునిట్లు భీము బ్రాహ్మణార్థమ్ముగా
నసురవాతఁ ద్రోతు రవ్వయిట్లు.
సం. యస్య దుర్యోధనో వీర్యం చింతయ న్నమితౌజసః

ఒండు=కార్యాంతరములను, తక్క=మాని, ఉపాయంబులు=వెరవులు. త్రోతు రవ్వ=తోలితురా? త్రోవరనియర్థము. అవ్వ శబ్దమ చాదులలోనిది.

279 గీ. భ్రమవిమోహాలోభభయపరిభూతనై—

భ్రమ=మిథ్యాజ్ఞానము, విమోహ=అజ్ఞానము.

250 తే. గీ. వీఁడుపుట్టినపదియవనాఁడు

సం. జాతమాత్రఃపురాచైవ మమాంకా త్పతితో గిరౌ.

ఖేద మరయునది.

282 తే. గీ. బ్రాహ్మణులకుఁ బ్రియమువాయక చేయంగఁ

గాన్పుసూవె పుణ్యకర్మఫలము.

వాయక=విడువక. ఇది వ్యర్థమును గర్మక్రియలనడుమనుండి యపార్థదమునైయున్నది.

చేయఁగాన్పు=చేయఁజూచుట.

283 క. జననుత! బ్రాహ్మణకార్యము

నన్ఁజేసిన బ్రాహ్మణప్రసాదంబుననీ

కును నీతమ్ములకును నగు

ననవరతశ్రీసుఖాయు రైశ్వర్యమ్ముల్.

చనన్=తగ, బ్రాహ్మణకార్యము + చేసిన. కర్మక్రియలకు నడుమ యతిపాపసముల

కోసము పడియపార్థము నిచ్చి పతితల నొంచు. నీ "చనన్" అనుపదము-చన్న మేలు.

284 భీముం డావిప్రున కిట్లనియె.

285 ఆ. గీ. కడుపునిండఁ గుడువఁగానమి రేమెల్లఁ

గన్ను వొందకున్నఁ గరము డస్సి

యున్నవాఁడ నాకు నోపుదు రేని నా

హారతృప్తి సేయుఁ డట్టులైన.

కన్ను (మాఁతను) పొందకున్న, అప్పవాలక,

286 ఆ. గీ. బలము పెద్ద గలిగి పాపిష్ఠు రక్కసుఁ

జంపియిప్పురమున జనులకెల్ల

హర్ష మెనొనర్తు ననవుడు విప్రుఁడు

తాను జుట్టములును తత్క్షణంబ.

286 తరలము. పలుదెఱంగుల పిండివంటలు పప్పుఁగూరలు నేతికుం

డలు గుడంబుదధిప్రపూర్ణఘటంబులుంగొనివచ్చియా

నలఘునత్త్వుఁడు మారుతాత్మజుఁ డన్నిటన్గతఖేదుఁడై
బలము గల్గికడంగెనప్పుడుబ్రాహ్మణార్థము సేయఁగాన్.

వ. ఇట్లు భీమసేనుం డిష్టాన్నభోజనంబుసం తృప్తుం డయిభక్ష్యాన్న పూర్ణం బయినశకటంబు నెక్కి దక్షిణాభిముఖుం డయి బకాసురుం డున్నచోటికిం జని యార్ద్రశుష్కకళేబరమాంసదుర్గంధనిందితం బయినబకస్థానంబు దాయక యెడఁగలుగ యమునాతీరంబున శకటంబు నిలిపి.

ఇది యాంధ్రకవి వ్రాసినచమత్కారము సంస్కృతమునఁ గనరాదు.

290 ఆ. గీ. అలిగి యాదుగఱచి యాఁకటి పెలుచన

ఔడు=పెదవిక్రిందిచోటు, దంతంబుపే కాడనంగ. ఆంధ్రనామశేషము.

293 ఇప్పుడ కాలుద్రోలి కే

గించెదఁ జక్కనై నిలుము గిట్టిరణంబున రాక్షసాధమా.

కిట్టు=సమీపించు.

295 గ్రక్కదలు=కదలు + కదలు=మిక్కిలి చలించు కాదిత్వమో గాదిత్వమో సందిగ్ధము.

296 ముష్టిఘాత జనితేరిత దారుణనిస్వనంబు న

య్యుద్ధఅపాదఘట్టితమహారవము న్విని చూపటెల్లనున్—

(జనిత + ఈరిత) పిడికిళ్ళదెబ్బలచేఁ బుట్టింపఁబడిన పొగడఁబడిన భయంకరధ్వని. చూపఱెల్లనున్, చూపఱెల్లరున్ అనమేలు.

297 క. కడఁగివృకోదరుఁ డసురం, బడఁగ వడిన్వైచి వామపాదంబున—వడిగం బడవైచి అనినను లక్షణముసెడదు.

299 కనకశైల నికుంజంబునుబోని వానివక్షము

పోని=పోలిన. పకారాదిత్వమో బకారాదిత్వమో అనిర్ణీతము.

300 సవ్యహస్తదక్షిణకరమ్ముమ్మలఁ గటికంఠప్రదేశములు వట్టికొని—

సవ్యదక్షిణకరమ్ముల అనరాదా.

**304 మాంసపంకారుణవారిపూరనదులై**

అరుణ=రక్తము. ఇది ద్విరేఫశబ్దము భ్రమరవాచకమైనట్టుశుతశార్థకమగునా?

305 అసాధ్యబలున్=అపారబలున్ అనమేలు.

**307 క. మలహరనాథా—ఇదియేమినంబుద్ధి?**

308 రాజనారాయణ=వెన్నుంబోనివిభూ.

## సప్తమాశ్వాసము.

3 ఆదుర్పదేశుదేశముం

బాలుపుగ నొండుదేశములు పోల్పఁగ నెవ్వియు లేవు

ఇతరదేశము లేవియు నాద్రుపదరాజుదేశముఁ బోల్పఁ బోలుపుగ=చక్కఁగ లేవు అని యన్వయము.

5 ద్రోణుండుదుర్పదుండు నొక్కటఁ దొడఁగి యిష్ట

సఖులయి వేదము లన్దివి

ఒక్కటన్=కూడ.

సం. ద్రోణేనసహ పార్షతః

చిక్రీడాధ్యయనంచైవ చకార.

9 కొను మిచ్చెద నీకు లక్షగోధేనువులన్.

సం. అయుతాని దదా మ్యష్టౌ గవాం యాజయమాంవిభో

ధేనువు=లేగటియావు, నవసూతిక

12 శిలోంఛవృత్తి.

శిలము=ఎన్నులు మొదలైనవి గడించుట, ఉంఛము=గింజలె యేరుటయను వృత్తి=జీవిక.

16 పదరత్నిధనుర్ధరుఁడు—

అరత్ని=చిటికెనవ్రేలు చాచినమూర.

17 సౌత్రామణి మైనకోకిలాదేవి

యాజస్తు హవనస్యాంతే దేవీ మాజ్ఞాపయ త్తదా.

నన్నయ హిడింబకుఁ గమలపాలిక యనుపేరు పెట్టినట్టె సౌతామణియనువిశేషణము తోఁ గోకిలా విశేషనామము పెట్టెను. సంస్కృతమున దేవి యనియె గనవచ్చును.

21 ద్రుపదుండు ధృష్టద్యుమ్నుని ధనుర్వేదపారగుం జేసి

సం. ధృష్టద్యుమ్నంతు పాంచాల్య మానీయ స్వం నివేశనం
ఉపాకరో దస్త్రహేతో ర్భారద్వాజః ప్రతాపవాన్
అమోక్షణీయం దైవం హి భావిమత్వా మహామతిః
తథా తత్కృతవా న్ద్రోణ ఆత్మకీర్త్యనుకీర్తనాత్.

ప్రతాపవంతుఁడగు ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుని దనయింట నునిచికొని, మహామతి గానఁ, గాఁగలయాపద కాకమాన దని తలఁచి, కీర్తియెసంగ నస్త్రము లుపదేశించె ను, అని మూలమున నుండ నన్నయ ద్రోణుఁడు దుపదవిరోధి యగుటఁ గాఁబోలు ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునియొద్దఁ జదివినట్లు వ్రాయఁడయ్యె.

22 ఉ. మానితు లైనపాండవకుమారులు గుంతియు లక్కయింటను
గ్రానలదగ్ధులై రని ధరామరముఖ్యు లెఱింగి చెప్పఁగా
నానరనాయకుండు విని యాతతశోకమహానలజ్వల
నాత్మనుఁడయ్యె బంధుజనమంత్రిపురోహితవిప్రసన్నిధిన్.

23 మఱియును

24 సీ. ఇంద్రసమానున కిందీవరశ్యామ
సుందరాంగునకింద్రనందనునకు
దేవిగాఁ బ్రీతితో దీని నీగాంచితి
ననియున్నచో విధాత్రునకు నిట్లు
పాడియె విఘ్న మాపాదింప నిమ్మహా
ధ్వరమునఁ బుట్టినసరసిజాక్షి
నేనెట్టు లొరులకు నీనేర్తునని దుఃఖ
పరవశుఁ డయినయద్ధరణిపతికిఁ

ఆ. గీ. దత్పురోహితుండు దానిట్టు లనియె న
ప్పాండవులగుఱించి బహువిధంబు
లగునిమిత్తములు నయంబునఁజూచితి
నెగ్గు లేదు వారి కెల్ల లగ్గు.

వ. తొల్లి దేవేంద్రుండు కొండొకకాలం బదృశ్యుండైయుండిన నత
నిం గానక శచీదేవి శోకించుచున్న యుపశ్రుతిం జేసి బృహస్పతి
దానికి దేవేంద్రాగమనంబు సెప్పె ననివేదవచనమ్ములవినంబ
డుం గావున నేనుపశ్రుతిం జూచితి నిది దప్పదు పాండవులు పర
లోకగతులు గారు పరమానందంబున నున్నవారు. వార లెం
దుండియేనియు నిందులకు నత్తురు నీవును సుచిత్తుండవై స్వయం
వరం బిప్పురంబున ఘోషింపం బంపు మిది కన్యాదానంబునందు
రాజులకు శాస్త్రచోదితం బనినం బురోహితువచనంబునం జేసి
యూఱడిల్లి ద్రుపదుండు నేఁటికి డెబ్బదియేనవదినంబునఁ జావ
మాసంబునఁ బంచమియురోహిణినాఁడు స్వయంవరం బని ఘో
షింపం బంచి.

సం. యజ్ఞసేనస్య కామస్తు పాండవాయ కిరీటినే
కృష్ణాం దద్యామితి సదా నచైతద్వివృణోతి సః
సోన్వేషమాణః కౌంతేయం పాంచాల్యో జనమేజయ
దృఢం ధనురనాయమ్యం కారయామాస భారత
యంత్రం వైహాయసంచాపి కారయామాస కృత్రిమం
తేన యన్త్రేణ సమితం రాజా లక్ష్యం చకార సః

ద్రుపదునికిఁ గన్నె నర్జునున కీయఁగోరికి. ఇది యెవరికిఁ బ్రకటింపఁడు. కిరీటిని వెదకుచు గట్టిది, ఎవరికిమోపెట్టరానిది యగువిల్లును మింట యన్త్రమును నిర్మించె. ఇంతయె మూలమునఁ గలదు.

తెనుఁగున ద్రుపదుఁడుతనభావము ప్రకటించి దుఃఖపడఁ బురోహితుఁ దుపశ్రుతిం.

పాండవులసేమ మెఱింగి స్వయంవరోపాయ ముపదేశించె ననునర్థము కల్పితము. రోహిణీయుక్త పౌషపంచమీముహూర్తమును నన్నయజ్యౌతిషికుఁడు పెట్టినదియే.

26 ఎవ్వరికిని మోపెట్టను
దివ్వను శక్యంబుగానిపృథుకార్ముకముఁ
ద్రవ్వె దివమునఁ దిరిగెడు
నవ్విలసత్కనకమత్స్యయంత్రముఁ జేసెన్.

మోపెట్టను దివ్వను శక్యంబుగాని—

ఎక్కిడుటకును తివ్వన్, దివ్వన్=లాగుటకు, నసాధ్యంబు తకారాదియా దకారాదియా? తిగుచు మొదలయిన ఆకర్షణార్థప్రసిద్ధధాతువులకీరూప మసాధ్యము. తిగిచు, తివియు, తిగియు=లాగు దిగు, దిగ్గు, దివు, దివుచు, దిగుచు, దించు, దివ్వు, ధాత్వంతర మనుటయె యొప్పును.

36 అపేతదార్భాగ్య=పెనిమిటి కిష్టురాలుకాకపోవు పాపములేనిదై

37 అంతపొద్దు జలక్రీడార్థంబు వచ్చినవాఁడు.

కాలాధ్వములకుఁ బ్రాయికముగఁ బ్రథమయవు.

కృష్ణద్వైపాయనుం డరిగినఁ బాండవులు జననీసహితం బనవరతంబు రాత్రులుం బగళ్లును బయనంబుపోవువా రొక్కనాఁ డర్ధరాత్రంబున గంగయందు సోమశ్రివంబనుపుణ్యతీర్థంబున స్నానార్థులై.

సం. గతే భగవతి వ్యాసే పాండవా హృష్టమానసాః
తే ప్రతస్థుః పురస్కృత్య మాతరం భరతర్షభాః
సమైరుదఙ్ముఖై ర్మార్గైర్యథోద్దిష్టం పరంతపాః
తేత్వగచ్ఛన్నహోరాత్రాత్తీర్థం సోమాశ్రయాయణమ్
ఆసేదుః పురుషవ్యాఘ్రా గంగాయాం పాండునందనాః

అహోరాత్రాత్=ఒకపగటికిరాత్రికి, సోమాశ్రయాయణ మనుతీర్థము చేరిరి. ఎన్నో రాత్రులు పగళ్లు యాత్రయు, అర్ధరాత్రమున స్నానవాంఛయు నమూలకములు నసంగతములుగా నున్నవి.

38 క. ఇల నర్ధరాత్రిమును సం
ధ్యలు రెండును భూతయక్షదానవగంధ
ర్వలు గ్రుమ్మరియెడుప్రొద్దులు—

సం. సంధ్యా సంరజ్యతే ఘోరా పూర్వరాత్రాగమేషు యా
అశీతిభి ర్లవై ర్హీసం తన్ముహూర్తం ప్రచక్షతే
విహితం కామచారాణాం యక్షగంధర్వరక్షసామ్
శేష మన్యన్మనుష్యాణాం కర్మచారేషువై స్మృతమ్.

సాయంసంధ్యాకాలమునందు నెనుబదియగునిముషములమీఁదను, రాత్రియందును, కామచారు లగుయక్షాదులకు సంచారకాలమని మూలమునం దుండ నన్నయసంధ్యలు రెండు, నర్ధరాత్రమును యక్షాదులకు సంచారకాల మనుటకుఁ గారణము గానరాదు.

39 ఇవ్వనంబున గంగయు సంగారపర్ణ యను పేరిట, నివ్వనంబును
నంగారపర్ణంబను పేరిట జగద్విదితమ్ములు.

సం. అంగారపర్ణ మిత్యేవం ఖ్యాతం చేదంవనం మమ
అనుగంగంచరన్కామాంశ్చిత్రంయత్రరమా మ్యహమ్.

"గంగయొడ్డుపొడుగున నేనద్భుతముగ విహారములు చేయుదు. ఆయీవనము అంగారపర్ణ మని ప్రసిద్ధము." ఇందలిగంగ కంగారపర్ణ యనుపేరు మూలమునందు లేదు.

42 సీ. హైమవతోత్తుంగ హైమశృంగంబున
నుండి భూమికి వచ్చి యుదధిఁ గూడి
గంగనా మూడుచెఱంగుల నదియు మం
దాకిని నా నభ్రపథంబునందు
సురసిద్ధమునివియచ్చరసేవ్యమయ్యె న
య్యురగలోకంబునందొసర భోగ
వతి యననొప్పియున్నతి నిట్లు త్రిభువన
పావనియైనయ ప్పరమనదిని

ఆ. గీ. పార్వతీశమకుట బంధబంధురత రా

వాసగంగ నాడవచ్చినీవు
వలదనినను నుడుగువారము గామునీ
విఘ్నవచనములకు వెఱతు మెట్లు.

భూమియందు గంగ, మింట మందాకిని, పాతాళమున భోగవతి, యన మూడు తెఱంగుల నొప్పి యని యన్వయించుకొనవలయు. ఇది గ్రంథాంతరమునుబట్టి వ్రాయఁబడినది. మూలమునందు గంగానది పితృలోకమునందు వైతరిణి యనియు, దేవలోకమునం దలకనంద యనియుఁబిలువఁబడు నని మాత్రమున్నది.

43 గంగాభిషేకార్థం బరుగునయ్యర్జునుఁడయి—
మూలము మృగ్యము. రాత్రి స్నానసంకల్పము శాస్త్రవిరుద్ధము. ఇది తెనుఁగునందే కనఁబడుచున్నది.

53 సీ. వృతుపై గీర్వాణవిభుఁ డల్గి వ్రజంబు
వైచిన నది వానివజ్రికలిన
పటుమస్తకంబునఁబడి పాతరయమునఁ
బదివ్రయ్యలైనఁ దద్భాగచయము
క్రమమున బ్రాహ్మణక్షత్త్రియవిట్ఛూద్రు
లందు వేదంబును నాయుధములు
హాయము శుశ్రూషయునయ్యె వజ్రింబన
వాహంబులందు జవంబు వజ్ర

తే. గీ. మయ్యె—
సం. పురాకృతం మహేంద్రస్య వజ్రం వృత్రనిబర్హణం
దశధా శతధా చైవ తచ్ఛీర్ణం వృత్రమూర్ధని
లోకే యశ్శోధనం కించి త్సా వై వజ్రతనుస్స్మృతా
వజ్రపాణి ర్బ్రాహ్మణ స్స్యాత్ క్షత్రం వజ్రరథంస్మృతం
వైశ్యా వై దానవజ్రాశ్చ కర్మవజ్రయవీయసః
క్షత్రవజ్రస్య భాగేన అవధ్యా వాజిన స్స్మృతాః

ఇది యర్థవాదము. అశ్వస్తుతి. వృత్రునితలపైఁ బడినవజ్రము తునుకలయి బ్రాహ్మణులకుఁ బాణియు క్షత్త్రియులకు రథమును వైశ్యులకు దానమును శూద్రులకుఁ గర్మమును నయి దేవతలచే నుపాసింపఁబడుచున్నది. అనఁగా బ్రాహ్మణునిపాణి హవిఃప్రద మగుటను, రథము దేవబ్రాహ్మణుల కపకృతిసేయువారిని నశింపఁజేయుటకు హేతు వగుటను, దానకర్మములును బ్రహ్మతుష్టిప్రీతికరము లగుటను వజ్రములయినవని భావము. రథమునకు వజ్రిత్వముగలుగుటకు! రథాంశము లగునశ్వముల యుత్కర్షమే ముఖ్యకారణము గాని ధ్వజాదికము గాదని యశ్వస్తుతి ఫలించినది.
నన్నయ బ్రాహ్మణులయందు వేదములు వజ్రమని చెప్పుటకుఁ గతము 'వజ్రపాణిః' యనుచోట 'వజ్రవాణిః' అని యుండు నని తలంచె నేమో? రథము యుద్ధోపకరణముగాన నాయుధములు నట్టివే; యేమన్న నేమి యని తలంచి రాజులయం దాయుధమువజ్ర మనినాఁడు గాఁబోలు! దానముద్రవ్యసాధ్యము. ద్రవ్యము కృషిసాధనమైనహలముచేఁ గలుగు నని యెంచి వైశ్యులయందు హలము వజ్రమని వ్రాసినాఁడా? కర్మమనఁగా శుశ్రూష యని యర్థముచేసి శూద్రులందు శుశ్రూష వజ్ర మని చెప్పియుండును. రథమును క్షత్త్రివజ్రముగాఁ జెప్పనినాఁడు రథాంశము లగుహయములను జెప్పుటకుఁ బ్రసక్తి యెట్లు గలుగును? కావున హయములందు జవము వజ్రమని స్వాంతకవనము చేసి ప్రస్తుతమునకు వచ్చినాఁడు.

59 ఇంతులగోష్ఠి నున్నయతఁ డెంతవివేకము గల్గెనేని న
త్యంతమదాభిభూతుఁ డగుధర్మువుఁ దప్పి ప్రియంబెఱుంగఁడే
నెంతవివేకినయ్యును సహింపక యింతులయొద్దఁ బల్కులేక
వింతయె కాముశక్తి యుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్.

సం. స్త్రీసకాశేచ కౌరవ్య నపుమాన్ క్షంతు మర్హతి
ధర్షణా మాత్మనః పశ్యన్ బాహుద్రవిణ మాశ్రితః.

స్త్రీలయొద్ద నున్నపుడు బాహుబలముగలపురుషుఁడు తన్నొరుఁడు వెలిపింపఁ జూచి సహింపఁజాలఁ డనుమూలార్థము తెనుఁగునందుఁ గనుపట్టుచున్నదా? సహింపక యను మాట కింతయర్థము దోఁపదు. "వింతయె కామశక్తి యుడిపింపఁగ" అనుప్రాచీనపాఠమును వ, పలకుయతిప్రాసముల నంగీకరింపక 'యుడిగించు' లోని గకారమునకుఁ 'క్వచిద్గకారోవః' యనుసంకుచితశాస్త్రమ్ము ననుసరించి వకారముఁ జేసి యుడివింపఁగ నని దిద్దుట యయుక్తము. "పరమధ్యానో పరతేంద్రియవృత్తినున్నవాని కమికున్"

మొదలగుచోట్ల నిట్లే యయుక్తముగ సవరింపఁబడినది.

73 సీ. త్రిభువనలక్ష్మి యే తెంచి యేకాంతమి
ట్లేలోకో యున్నది యౌవనమున—

ఏకాంతము=రహస్యముగ.

85 లోకలోచనుం
డగుదిననాథు నాతతసహస్రకరుం గని—

'లోకలోచనం బగు' అని యుండఁజను. ఇట్టిప్రయోగములఁగూర్చి ముందుఁ జర్చించితిమి.

87 గారవమున నిచ్చి యాఋషితోడఁ బు
త్తెంచె—

ఋ రి కారంబులు రలతుల్యంబులుగావున రేఫఋకారములకుఁ బ్రాసము.

88 ఒక్కనిముసంబున మున్నూటయిరువదినాలుగుయోజనంబులు.
పఱచునాదిత్యురథంబుతో—

సం. యోజనానాం సహస్రాణి ద్వేశతేద్వేచ యోజనే
ఏకేన నిమిషార్థేన క్రమమాణ నమోస్తుతే. భా. ఆరణ్య

అరనిముసమునకు నొకవేయునిన్నూటరెండు 1202 యోజనములు పఱచును. నిముసమునకు 2204 అగును. ఆంధ్రములోనిసంఖ్యకుఁ బ్రమాణ మేది? 'నూటయిరువది' యనరాదు. నూటనఱుపది యనవలయును.

93 క. ధృతి నెవ్వనినేనిఁ బురో
హితుఁగాఁ బన్నమునఁబడసి—

ఏని, వాక్యాలంకారము.

95 శాంతుఁ డయి యెవ్వఁడేని కృ
తాంతకుఁ గడవంగ—

'కృతాంతుని గడవంగ, అనినచోఁ గప్రత్యయము లేకుండు

97 దధికుల్యములు—

కుల్యా + అల్పాకృత్రిమాసరిత్. కంధరాదులలోఁ జేర్చుకొనిననఁగాని సాధువుగాదు.

99 మొద విది నిధి సేరినట్టు సేరె నిమ్మునికిఁ బుణ్యమున—

కర్మమగుమునిశబ్దమునకు షష్ఠిప్రయోగింపఁబడినది.

129 గుణముల నొప్పి బ్రాహ్మణులకుం గడుభక్తుఁడవై సమస్తధా
రుణిఁ బ్రజఁబ్రోచుచున్ విగతరోషుఁడవై సుఖముండుమింక బ్రా
హ్మణుల కవజ్ఞసేయక శమంబును జేకొను మింద్రుఁడైన బ్రా
హ్మణుల కవజ్ఞ సేసియవమానముఁ బొందుఁబ్రతాపహీనుఁడై.

సంస్కృతమున ధారిణి, ధారణి, యను అకారేకారమధ్యము లగురూపములె కనఁబడుచున్నవి. తెనుఁగుపుస్తకములందు విశ్రమస్థానములందుసైతము ఉకారమధ్య మగు ధారుణీశబ్దము గలదు.

136 కృతవీర్యామ్నాయజక్షత్రియా ధములెల్లన్—

వేదాద్యర్థక మగునామ్నాయశబ్దము 'వంశము' అనుసందర్భార్థమును జెప్పఁజాలదు.

142 మదీయభాషిత మెన్నఁడు
న్నేని మోఘముగాదు దిగ్ధరణీరవీంద్రులెఱుంగఁగన్—

'రవీంద్రులెఱుంగఁగన్' అనవలయును. రవీంద్రులు సహపఠితులుగదా? ఎన్నఁడున్ + ఏనిఅనివిభజించిన, తస్మిన్నద్రౌ అనుచోవలెఁ దెనుఁగునందు ద్వితీయ నకారము రాదు. అఖండయతిదోషమును గలుగును. "ఎన్నఁడున్నేను మోఘముఁ జేయ' అని కవికృతపాఠ మేమో? అట్లయినచో 'ఏను' శబ్దముగాని 'నేను' శబ్దము భారతమునం దెచ్చటను బ్రయోగము లేదనుటకు వీలుపడదు.

143 జలమునందునుండు సర్వలోకంబులు
గాన నీమహోగ్రకలుషవహ్ని
జలధిలోన విడిచి సత్యప్రతిజ్ఞుండ
వగుము జలధిజలము లది దహించు

సం. య ఏష మన్యుజస్తేగ్ని ల్లోకా నాదాతు మిచ్ఛతి
అప్సు తం ముంచభద్రం తే లోకాహ్యప్సు ప్రతిష్ఠితాః.

కలుషపదము పాపవాచకము. కోపమనునర్థ మిచటఁ గావలసినది.

158 స్వస్త్యయనము=శుభముసుబొందించునది=ఆశీర్వచనము.

160 ధృష్టద్యుమ్నుఁ డన నుదయించిన నతనితోడ నొక్కఁటఁబుట్టె
ను నొకకన్య—

పుట్టెనునొకయనుచో స్వాత్వసముచ్చయము లేదు.

162 క. మీయందును గృష్ణ నుదం
సాయతభుజుఁజూచితాన హర్షముతోడం
దోయజముఖవరియించును

సం, దర్శనీయాంశ్చ వస్సర్వా న్దేవరూపా నవస్థితాౝ
సమీక్ష్య కృష్ణా వరయే త్సంగ త్త్యైకతమం వరమ్
అయం భ్రాతా తవ శ్రీమా న్దర్శనీయో మహాభుజః
నియుజ్యమానో విజయే త్సంగత్యా ద్రౌపదీం బహు

ఉల్ + అంస=ఎగుమూఁపులు గలవాఁడు. ఆయతభుజుఁడు=ఆజానుబాహుఁడును.
విశేషణోభయపదకర్మధారయము.

165 ఆగామి కశుభంబులు—

ఆగామిశుభంబులు అనవచ్చు వ్యర్థమును అపార్థప్రతీతికరంబులు అగుకపఅత్యాయ మేలం.

168 కుంభకారగృహంబునవిడిసి—ఇది యమూలము.

176 క. వడి నొడుగఁజిచిపల కే
ల్నిడుచన గనయమునఁబెనఁచి నీల్గి బలంబే
ర్పడ విల్లువంపనోపక
యుడిగిరి నృపసుతులు గొందఱొయ్యన లజ్జౝ.

నిడుచన=నిడుద + చన=చాఁగ గనయము=నారి.

177 క. బలవంతులు బలమఱఁగా
మలఁగక మాత్రినొఙ్ఞినుపాట మాయాధను వి
మ్ముల్లఁ జేసెను మో పెట్టఁగఁ

గొలందిమె యని డాయక్రైరి కొందఱుదానిన్.

ఆఱు=నశించు. అకర్మముగాన బలవంతులబలము అనఁజను. మాఁగినమాఁగినపాట=చెట్టంతయుఁ.

173 అంత శిశుపాలజరాసంధశల్యకర్ణులు దర్పించి తమలావు మెఱసి క్రమంబున నలువురు మాషయవముద్గతిలమాత్రమ్ముగాను దక్కఁ గొనయం బెక్కించియు మోపెట్ట నశక్యంబయిన నుఱుకు సెడి గ్రుక్కిన—

సం. మద్రేశ నీల మగధా
మాషముద్గతిలాంతరే

అని యాశ్వాసభారతచంపువునఁ జదివినజ్ఞప్తి

సం. దమఘోషసుతో ధీర శ్శిశుపాలో మహామతిః
ధనురాదాయ మానస్తు జానుభ్యా మగమ న్మహీమ్
తతో రాజా మహావీర్యో జరాసంధో మహాబలః
ధనుషోభ్యాశ మాగత్య తస్థౌ గిరి రివాచలః
ధనుషా పీడ్యమానస్తు జానుభ్యా మగమ న్మహీమ్
తతశ్శల్యో మహావీర్యో మద్రిరాజో మహాబలః
తద ప్యారోప్యమాణస్తు జానుభ్యా మగమ న్మహీమ్
సర్వాన్నృపాం స్తా స్ప్రసమీక్ష్య కర్ణో
ధనుర్ధరాణాం ప్రవరో జగామ
ఉద్ధృత్య తూర్ణం ధను రుద్యతం త
త్సజ్యం చకా రాశు యుయోజ బాణాన్
దృష్ట్వా సూతం మేనిరే పాండుపుత్త్రా
శ్చిత్త్వానీతం లక్ష్యవరం ధరాయామ్
ధనుర్ధరారాగకృతప్రతిజ్ఞ
మత్యగ్నిసోమార్క మథార్కపుత్త్రమ్

దృష్ట్వాతు తం ద్రౌపదీవాక్య ముచ్చై
ర్జగాద నాహం వరయామి సూతమ్
సామర్షహాసం ప్రసమీక్ష్య సూర్యం
తత్యాజ కర్ణః స్ఫురితం ధనుస్తత్

చేదిరాజును బలవంతుఁడు నగు శిశుపాలుఁడు ధనువుం బరీక్షించుచునే మోఁకతిలం బడెను. పిదప మహావీర్యుఁడగు జరాసంధుఁడు ధనుస్సుచేఁ బీడింపఁబడినవాఁ డగుచు మోఁకతిలంబడి లేచి స్వరాష్ట్రములకుఁ బోయెను. తరువాత మహాబలుఁ డగు శల్యుఁడు వింటి నారోపింపఁ దలఁచినవాఁ డగుచు మోఁకతిలంబడెను. ధనుర్ధరప్రవరుఁ డగు కర్ణుఁడు ధను వెత్తి సజ్యముఁ జేసి శీఘ్రముగా బాణములఁ గూర్చెను. పాండుపుత్రు లా సూతసుతుఁడు లక్ష్యమును గొట్టె ననియే తలంచిరి, అపు డగ్ని సోమార్కప్రభలఁ గ్రిందుపఱుచు కర్ణునిం జూచి ద్రౌపది నేను సూతుని వరింప నని బిగ్గరగాఁ బలికెను. ఆ మాట విని కర్ణుఁ డమర్షహాసములతో సూర్యుని జూచి స్ఫురిత మగు నా ధనువును విడిచెను.

ఈఘట్టమునందు నన్నయ వ్యాసభారతమును జూచినట్లే కనుపట్టదు. చూచి నచో శిశుపాలాదులతోఁ బాటిగఁ గర్ణుని జేరొకనఁడు

182 తత్కర్మసంసిద్ధి నుత్తముఁడై పొందెదు మంచు—

ఎడుతల ద్రుతమునకు మకారము.

209 అట్టి యవసరంబునఁ దల్లియొద్దకు ధర్మరాజును గవలవారును మున్న వచ్చియున్న ననంతరంబ భీమార్జునులు ద్రౌపదీసహితు లయి వచ్చి—

సం. గత్వాతు తాం భార్గవకర్మశాలామ్

భార్గవశబ్దమునకు శుక్రుఁడు పరశురాముఁడు నర్థములు. భ్రస్జ పాకే యను ధాతువు నకు రూపము భృగు. కుండలు గాల్చువాఁడు గావున యోగమున దానికిఁ గుమ్మరి యని యర్థమగునా? అట్లయినఁ " గుంభకారగృహమ్మున విడిసి " యను దాని కిదియే మూల మగును.

సం. తతస్తు కుంతీ ద్రుపదాత్మజాం తా
ముచాచ కాలే వచనం వదాన్యా

త్వమగ్రమాదాయకురుష్వభద్రే
బలించవిప్రాయచదేహిభిక్షామ్
యేచాన్నమిచ్ఛంతి దదస్వతేభ్యః
పరిశ్రితాయే పరితో మనుష్యాః
తతశ్చశేషం ప్రవిభజ్యశీఘ్ర
మర్థంచతుర్ధామమచాత్మనశ్చ
అర్ధంచభీమాయచ దేహిభద్రే
యఏషనాగర్షభతుల్యరూపః
గౌరోయువాసంహననోపపన్న
ఏషోహివీరోబహుభుక్సదైవ

కుంతి ద్రౌపదితో "భద్రా! నీవు ముందుగాఁ గొంతయన్నముఁ జేకొని దానిని బలికి బ్రాహ్మణులకు నన్నార్థులకు నుపయోగించి, మిగిలినది రెండుపాళ్లు చేసి, సగపాలు ధర్మజార్జుననకులసహదేవులకు నాకు నీకును బెట్టి, కడమసమాంశమును భీమున కొసంగుము. ఇతఁడు మహాబలుఁడు. ఎపుడును బహుభోక్తయుఁ జుమీ" యని పలికెను. ఈయర్థమును నన్నయ యిట్లు తెలిఁగించెను.

222 అయ్యవ్వయు ద్రౌపది నంతఁ బిలిచి

ఆ. గీ. బలివిధానములకు బ్రాహ్మణాతిథులకు
నన్నకాంక్షు లైనయతిథులకును
నగ్రమందు నుంచి యయ్యన్నశేషంబుఁ
జెలువ రెండుపాళ్లు సేయు మొనర.

223 క. వెడదయురంబును నన్నువ
కడుపును దృఢకఠినతనువుఁ గలయాతనికిం
దొడర నొకపాలువెట్టుము
వడి నాగాయుతబలంబువాఁ డతఁ డబలా!

224 మఱియు రెండవపా లన్నలువురకుం బెట్టి తద్భుక్తశేషంబు నీ

వును నేను నుపయోగింతమనిన

నాగాయుతబలముయొక్కవాడు, నాగా...లంబువాఁడు.షష్ఠీతత్పు. పదివేలయేన్గుల బలము గలవాఁ డనియర్థము.

పాండవులయుచ్ఛిష్టమును భార్యయగుద్రౌపదివలెఁ దల్లికుంతియుఁ దినునాః మూలము నందే మం దిట్లు వివరింపఁబడినది.

సం తేషాంతుభైక్షంప్రతిగృహ్యాకృష్ణా
దత్వాబలింబ్రాహ్మణసాచ్చకృత్వా
తాంచైవవృద్ధాం పరివేవ్యతాంశ్చ
నరప్రవీరాన్ స్వయమప్యభుఙ్త్త

ఆపాండవులు తెచ్చినమాధుకరాన్నము నందుకొని ద్రౌపది బలికిని, బ్రాహ్మణులకు నుపయోగించి యాముదుసలియత్తకు నాపురుషులకును వడ్డించి తానును భుజించె.

226 క. కడవసములుఁ గోలలుఁ గ
ప్పడములు వీరలధనంబు పరికింపఁగ నె
క్కుడిదేశికు లని వగవక
మడవక తనుమధ్య నిండుమనమున నుండెన్.

కడవసములు=తోళ్లు, కప్పడములు=జీర్ణవస్త్రములు. ఎక్కుడిదేశికులు, దేశికశబ్దము గురువాచకము. ఏదేశమువారు అని యౌగికార్థము, కవిభావమునం దుండెనేమో?

234 బాణతూణీరరథవరూథవాజివారణంబుల—

వరూథపదమును రథవివక్షతోఁ బూర్వ మీకవి యెన్నియోసారు లుపయోగించెను. ఇచట రథపదమును గూడ నుపయోగించెంగావున వరూథపదమునకుఁ బులితోలు మొదలయినరథగుప్తి యొండె, నరదమున రథికునిసంరక్షణ కేర్పడినచోటుగాని యర్థము చేసికొనవలయు.

246 క. విమలమతి యన్యులకు విష
యమె ధర్మాధర్మనిర్ణయము సేయఁగ

అన్యులకువిషయమె=ఒరులకు వేద్యమా.

253 నం, దొంఅకునిట్టులనిమెద్రుపదవిభుఁడు.

అందొంట ఒకారమధ్యమునకు యతిప్రమాణము.

255 దేవతామూర్తి యిద్దేవి మాధవి యేల తా నెఱుంగక యనృ
తంబుపల్కు-

మాధవి=కుంతి, సంస్కృతమునఁ గుంతీపరమగుమాధవీపదము గానరాదు. వ్యుత్పత్తి యెట్లు.

256 ఇది దొల్లినాలాయని మైనయిందఱిసేన యసంబరఁగిన పరమ
పతివ్రిత.

261 దానికడకుఁ బ్రిత్యేకంబ ధర్మవాయు
వాసవాశ్వినుల్ ప్రీతులై వచ్చి దాని
నాత్మదేహాంశజులకు దేహాంతరమునఁ
బత్నిగా గోరి రధికసౌభాగ్యయుక్తి.

ఈచరిత్రము సంస్కృతమునఁ గనరాదు.

274 క. గర్వించి పలికితివి నీ
గర్వము భుజవీర్యమును బ్రికాశంబుగ నీ
పర్వతశిఖరం బెత్తివి
గుర్వింపుము చూత మనిన గోత్రిభిదుండుఙ్.

విగుర్వింపుము, విఱుచువిఱుచు విగుర్వించు=చకచ్చఁగావిఱుదు, అని సీతారామాచార్యుఁడు. మూలముం జూచినచో 'దూరముగాఁ బెట్టుమ' నియర్థము చేయవలయును. ఈధాతువు నన్నయభట్టసృష్టమే. ముందటిసీసములో భట్టారకుఁ డీవిగుర్వించుధాతువునకు 'దింపు' మని వ్యాఖ్యానముఁజేసినాఁడు.

257 సీ. హరువచనమున నాగిరిరాజశిఖరంబుఁ
గరములఁ బట్టి చెచ్చెరదిసేశ
చండమయూఖముల్ రెండువిధమ్ములై

యుండంగ దించి యాఖండలుండు
దనయట్టివారల ఘనశరీరుల సందు
నలువుర నన్యుల వెలయఁ జూచి
యే నిట్టులేలొకో యేనుపస్కారము
లయితి నిందనుచు విస్మయముఁ బొంది

గీ. యున్నఁ జూచి హరుఁడు గన్నన యిందుగ్రిల
నేవురను మహానుభావ మెసఁగ
మనుజయోనిఁబుట్టుఁ డనిపంచె గీర్వాణ
హితముఁ జేయుపొంటె మతిఁ దలంచి

సం. ఛిద్రస్యచైవావిశమధ్యమస్య
యతాగ్రిసతేత్వద్విధాస్సూర్యభాసః

'నీవంటివారు సూర్యప్రకాశులు నలువు రున్నయీపర్వతరంధ్రము నడిమిభాగముఁ బొందుము' ఈమూలమునకు నన్నయ దినేశచండమయూఖముల్ రెండువిధమ్ములై యుండంగ, అని తెనిఁగించుటకు 'తద్ద్వివిధాః' అనిపాఠ ముండెడిదేమో

278 సకలలావణ్యమూర్తి=అఖిలకాంతియు శరీరమునఁ గలది. వ్యధికరణబహువ్రీహి.

279 క. కాంతివిశేషవిలాసా
సంతశ్రీఁ దనరు నజితయం దనఘులునై
తంతవు లేవురు పడసిరి
సంతానము వేలువేల సత్కుల మెసఁగన్.

ఇది సంస్కృతమున నదృష్టము.

281 ఆ. గీ. నేఁడు పుణ్యదినము నెమ్మితో రోహిణీ
యుక్తుఁ డైశశాంకుఁ డున్నవాఁడు
మంత్రవంతముగఁ గ్రమంబున నేవురు
పెండ్లియగుదు కృష్ణఁ బ్రీతితోడ.

సం. అద్యపుష్యేయోగముపైతిచంద్రమాః.

281 పురం బష్టశోభనంబు సేయించి—అష్టశోభనమన నేమియో?
అశ్వత్థపల్లవమాలాలంకృతద్వారతోరణమ్ముల—సంస్కృతమున నదృష్టము.
తొల్లి రావియాకుతోరణములు గట్టువారోకో! రంగవల్లి=ముగ్గుతో నేర్పఱుపఁబడిన
తీఁగశిల్పము. ప్రవర్తమాన=ప్రవర్త్యమాన అనవలయు.
పూర్వోత్తరదిగ్భాగమున=ఈశాన్యదిక్కున, విచిత్రనేత్రవిరచితవితాన=పలురంగులు
గలమేలివలువలచేఁ గట్టఁబడినమేలుకట్లు.
289 విశిష్టాంభోజమిత్త్రి=సదాచారులనుపద్మములకు సూర్యా!

## అష్టమాశ్వాసము.

2 అర్థరాసులు (రాశి) ఉపధాచజభిన్నములకు దంత్యమువచ్చుట కిదిప్రమాణము కా
వచ్చును.

4 కరుణ గలుగుమమ్మ కమలనేత్ర
కలుగుధాతువు ప్రాప్త్యర్థకము. సకర్మకము.

5 రాజసూయమఖమాదిగ నధ్వరపఙ్క్తి
మఖ అధ్వర=అర్థపౌనరుక్త్య మపరిహృతము.

6 ఇందీవరలోచన నీ
యం దేనభినందితాత్మనైనట్టులు నీ
నందనులయందుఁ బౌత్రుల
యందును నభినంద్యవగుమ యనిదీవించెన్.

సం. యథాచత్వాభినందామి వధ్వద్యక్షౌమసంవృతామ్
తథాభూయోభినందిష్యే జాతపుత్రాంగుణాన్వితామ్.

ఓకోడలా! నేఁడు తెల్లచీరఁ గట్టుకొన్న నిన్నెట్లుమెచ్చుచున్నానో అట్లు అంతకం
టె మఱియధికముగను గొడుకులఁ గన్నగుణఖనిని నిన్ను మెచ్చఁగలను. మూలవ్యత్యా
సమును బరికించునది.

8 డామర=కొల్ల మొదలగుదేశోపద్రవములు. రూ—డమరము.

7 వాసుదేవుండు ద్రౌపదిని పాండవు లేవురు వివాహంబగుట విని సంతోసిల్లి వారేవురకు వజ్రవైదూర్యమరకతమౌక్తికవిభూషణమ్ములును నానాదేశవిచిత్రవస్త్రమ్ములును ననేకకరితురగరథరత్నఖచితశిబికాందోళవిలాసినీనివహమ్ములం గొనివచ్చి యిచ్చి దు్రపదుపురంబున నున్నంత—

"కొనివచ్చియిచ్చి దు్రపదుపురంబున నున్నంత" అనుపాఠము కొన్నిప్రతులయందు లేదు. మూలవిరుద్ధమును. 'నివహమ్ములుం బుత్తెంచిన'. అని దానిచోటఁ గలదు.

9 పాండవులు దు్రపదపురంబున నొక్కసంవత్సరం బుండునంత

సంస్కృతమున లేదు.

చ. అనిమొన నట్లు దాఁకిన మహారథులన్ధృతరాష్ట్రరాజనం
దనుల బలాఢ్యులన్ దళితదర్పులఁ జేసినవారు ధర్మనంద
నయము లుగ్రవీరు లని తద్విధమంతయు నేర్పడంగఁ జె
ప్పిన వినికౌరవప్రభుఁడు పెల్కుఱితద్దయుదుఃఖితాత్ముఁడై.

7 ఆశ్వా. 195 యంత్రింబు నరుఁ డేసినప్పుడు వోయినయాగౌరవర్ణుం
డు యమతనూజుఁ డాతనితోడన యరిగినయిరువురు గవల
వా రర్కపరికాశతేజు లనిన

సం. తస్మింస్తుశబ్దేమహతిపరివృద్ధే
యుధిష్ఠిరో ధర్మభృతాంవరిష్ఠః
ఆవాసమేవోపజగామ శీఘ్రం
సార్థంయమాభ్యాం పురుషోత్తమాభ్యామ్.

సంస్కృతమునకును బూర్వపుస్వాంధ్రమునకును విరుద్ధము.

14 విదురుండు, పాండవులు ద్రౌపదిం బెండ్లియై దు్రపదుపురంబున నున్నవారని ధృతరాష్ట్రునకుం జెప్పిన

సం. విదురస్త్వథతాంశ్రుత్వా ద్రౌపదీంపాండవైర్వృతామ్
వ్రీడితాన్ధార్తరాష్ట్రాంశ్చ భగ్నదర్పానుపాగతాన్
తతఃప్రీతమనాః క్షత్తాధృతరాష్ట్రంవిశాంపతే
ఉవాచ దిష్ట్యాకురవో వర్ధంతఇతివిస్మితః
వైచిత్రవీర్యస్తునృపోనిశమ్యవిదురస్యతత్
అబ్రవీత్పరమప్రీతోదిష్ట్యాదిష్ట్యేతిభారత
మన్యతేసవృతంపుత్రం జ్యేష్ఠం ద్రుపదకన్యయా
దుర్యోధనమవిజ్ఞానాత్ప్రజ్ఞాచక్షుర్నరేశ్వరః
అథత్వాజ్ఞాపయామాసద్రౌపద్యాభూషణంబహు
ఆనీయతాంవైకృష్ణేతి పుత్రందుర్యోధనం తదా
అథాస్యపశ్చాద్విదుర ఆచఖ్యౌపాండవాన్వృతాన్
సర్వాన్కుశలినో వీరా న్పూజితా న్ద్రుపదేనహ
తేషాంసంబంధినశ్చాన్యాన్బహూన్బలసమన్వితాన్
సమాగతాన్పాండవైస్తైస్తస్మిన్నేవస్వయంవరే.

నన్నయ సంస్కృతమునందలిసారస్యమును విడిచినాఁడు.

21 చెయ్వులు=క్రియలు.

24 అపగతదోషంబును దీర్ఘసూత్రంబును నగు—

అదీర్ఘసూత్రము అనవలయు=అచిరక్రియము.

సం. ఏతేషామప్యుపాయానాంయస్తేనిర్దోషవాన్మతః
తస్యప్రయోగమాతిష్ఠపురాకాలోతివర్తతే

26 పెక్కండ్రు, నెమిళ్లు అనునట్లు బహువచనముమీఁద బహువచనము.

ఉపాంశు=రహస్యము.

30 పితృపైతామహంబు=తండ్రులకుఁ దాతలు నేలినది.

35 కుశాగ్రీయ=దర్భమొనవంటి

అ, జ్ఞులుభూనాథుల కాపులు సఖులు నై శోషింతు రత్యంతమున్-శోభింతు రని దిద్దఁ జను.

39 నితంతు వనుమగధ రాజు

సం. ఆసీద్రాజగృహేరాజామగధానాం మహీక్షితామ్
శ్రూయతేహిపురాకశ్చిదంబువీచఇతీశ్వరః

41 కఱపులు=ఉపదేశములు.

అలిగి వానికిభీష్మద్రోణులిట్లనిరి.

సం. ద్రోణఉవాచ

సౌమ్యాకృతులు గానివారల—అమూలము

64 ఏనుసంవత్సరమ్ము లుండునంత

సం. విశ్రాంతాస్తేమహాత్మానః కంచిత్కాలం మహాబలాః
ఆహూతాధృతరాష్ట్రేణ రాజ్ఞాశాంతనవేనచ
అర్థం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థమావిశన్.

69 క. హరి యింద్రుఁడలఁచె నింద్రుఁడు
గరమనురాగమున విశ్వకర్మను బనిచెన్
సురపురమున కెన యగుపుర
మరుదుగ నిర్మింపు మిర్వనని కడుఁబ్రీతిన్.

సం. తతఃపుణ్యేశివేదేశె శాంతిం కృత్వామహారథాః
నగరం స్థాపయామాసు ర్ద్వైపాయనపురోగమాః

60 ద్వైపాయనుండును ధౌమ్యుండు నాదిగా
భూసురు లూనతివిన్యాస మమరఁ
జేసి శాంతికవిధు లేయంగ
సుపరిశస్తం బైనరమ్యదేశంబునందు
వాసవాదిష్టుఁ డైవసుధకు నేతెంచి

పేర్మితో సవిశ్వకర్మ పురము। నిర్మించె

సంస్కృతమున విశ్వకర్మ పేరొకఁడుఁబడ లేదు.

77 అన్యవాహాము లనిసంశయపరిణిహితాత్ము డగున్హారిదశ్వుఁ
డొప్పుడుక్

స్వవాహ ములం దన్యవాహ బుద్ధి భ్రమము. సంశయ మెట్లు?

లతా। గరుఘనసారసాలసహకారముఖార్హమహీజరాజసుం
దరనవనందనావళుల

అగరు=అకారమధ్యము. పరియుక్తముకారమధ్యమును గనఁబడు.

అమరనిఘంటువున—

సూతో మాతలిర్నందనంవనమ్. అని యిందొరిద్యానపరముగా నున్ననందనశబ్దము
నుద్యానపరముగాఁ బ్రయోగించుచున్నాఁడు. నలదమ...విలసన్నవనందనమ్ములన్.
అని నలధర్మరాజాక్రీడపరముగాను బ్రయోగించె.

80 సర్వప్రకృతిజనానురక్తుఁడు=అనురక్తసర్వప్రకృతిజనుఁడు. అహితాగ్న్యాది.
ప్రేమగల యందఱుమంత్రులు పౌరజానపదులు గలవాఁడు.

82 సురాజ్ఞి=రాజన్వతి. మంచిరాజు గలది.

ఆ. అన్న రేందుపిందు నాపూర్ణతరశర
ద్వైందవాతపంబునందుఁ బ్రీతి
సమమకా సమస్తజనులచిత్తమ్ము లా
నందరసభరంబు నొందఁ దాల్చె.

సం. ధర్మరాజేహ్యతిప్రీత్యా పూర్ణచంద్రఇవామలే
ప్రజానాం రేమిరేతుల్యం నేత్రాణిహృదయానిచ.

జనులనేత్రములు హృదయములును ధర్మరాజునందు నిష్కళంక పూర్ణచంద్రునందు
వలెఁ బరమానందముతో సరిగఁ గ్రీడించె.

ఈవ్యాసశ్లోకము ననుసరించినకాళీదాసుని "ప్రసాదసుముఖే తస్మింశ్చంద్రేచవిశదప్ర
భే। తదాచక్షుష్మతాంప్రీతి। రాసీత్సమరసాద్వయోః అనుపద్యమును నన్నయ తెలిఁ
గించినాఁడని తోఁచెడి. ఒంద, తాల్చె=రెండేల. ఒంచె. తాల్చె. ఏదేనోఁడు
చాలదా? అర్థపూర్తికిఁబోలు.

93 ఇట్టిమీయేవురకిపుడు దు్రిపద
సుతయొక్కతియ ధర్మగతి ధర్మపత్ని యైనది.

మీయేవురకు—సర్వనామసంఖ్యాభిధానతద్విశేష్యమ్ముల కెయ్యదిముందుప్రయోగింపఁబడు దానిద్వితీయాదులకుం బ్రథమ వికల్పంబున నవు. మీరేవురకు, మీ కేవురకు, మీయేవురు=మీయొక్క-యేవురు. షష్ఠీతత్పురుషమా? మీ రను నేవురు. అనికర్మధారయమా? ఈపాట్లేల. ప్రమాదము. ధర్మగతి ధర్మపత్ని యైనది. అపానరుక్త్యమూహ్యము.

సం. పాంచాలీభవతామేకా ధర్మపత్నీయశస్వినీ.

95 వానకాలంబున శీతకాలంబునను జలాశయమ్ముల వసియించి

వర్షాస్వాకాశసంశ్రయః. ప్రమాణవిరుద్ధము.

103 తిలాసుమణికోటిసంఘటితదివ్యదేహంబుతోఁ

దిలోత్తమ—

సం. తిలంతిలం సమానీయ రత్నానాం యద్వినిర్మితా
తిలోత్తమేతి తత్తస్యా నామచక్రే పితామహః

రత్నముల నువుగింజలంతభాగములు గ్రహించి నిర్మింపఁబడుటచే బ్రహ్మ తిలోత్తమ యనుపేరుపెట్టె.

తిలాంశమణికోటి. అని దిద్దవలయు.

105 అజుఁడు నాలుగుదిక్కులందుఁ దనకుఁ గావించుకొనియె మొగమ్ములు.

అజుఁడు=హరుఁడు. అజావిష్ణుహరచ్ఛాగాః. నిఘం.

సం. సాతధేతిప్రతిజ్ఞాయ నమస్కృత్య పితామహం
చకారమండలంతత్ర విబుధానాం ప్రదక్షిణమ్
ప్రాఙ్ముఖోభగవానాస్తే దక్షిణేన మహేశ్వరః
దేవాశ్చైవోత్తరేణాసన్ సర్వతస్త్వృషయోభవన్
కుర్వత్యాతంతయాతత్ర మండలంతత్ప్రదక్షిణం

ఇందరిస్థానుశ్చభగవా న్దైర్యేణ పరిత్యవస్థితౌ
దరిష్టుకామస్యచాత్యర్థం గతయా పార్శ్వత_స్తయా
అన్యదంచితపద్మాక్షం దక్షిణం నిస్సృతంముఖమ్
పృష్ఠతః పరివర్త_న్త్యాపశ్చిమంనిస్సృతంముఖమ్
గతయాచో త్తరం పార్శ్వ మాత్తరం నిస్సృతంముఖమ్

మఱి రెండు। కన్నులం జూచినఁ గాదు తృప్తి। యని సురేంద్రుండు సహస్రాక్షుఁ డయ్యె న। య్యమరులు కామమోహాంధు లైరి.

సం. మహేంద్రస్యాపినేత్రాణాం పృష్ఠతః పార్శ్వతోగ్రతః
రక్తాంతానాం విశాలానాం సహస్రం సర్వతోభవత్
ఏవం చతుర్ముఖస్థానుర్మహాదేవో భవత్పురా
తథా సహస్రనేత్రశ్చ బభూవబలసూదనః
తయా దేవనికాయానాం మహర్షీణాంచసర్వశః
ముఖానిచాభ్యవర్త_న్త యేనయాతాతిలోత్తమా
తస్యాగాత్రేనిపతితా తేషాం దృష్టిర్మహాత్మనాం
సర్వేషా మేవభూయిష్ఠ మృతేదేవంపితామహం

110 క. సుందరి మాయిద్దఱిలో
నిం దెవ్వరి వలతుచెప్పు మీ వనవుడుఁబూ
ర్ణేందుముఖ వారి కను మీ
యం దెవ్వఁడువొడిచి యొడిచెనతనినవలతుౘ.

ఇది యసంస్కృతము.

115 సీ. ............గమలాక్షి యెవ్వరి
యింటఁ దానుండు నయ్యింటివలనఁ
బెఱవారు సనకుండ నెఱుఁగక చనిరేని
వెలయంగఁ బండ్రెండునెలలు తీర్థ

సేవఁ జేయుచును—

సం. ద్రౌపద్యా వస్సహాసీన మన్యోన్యం మోభిదర్శయేత్
సనో ద్వాదశవర్షాణి బ్రహ్మచారీ వనేవసేత్.

పం ద్రెండువత్సరములు బ్రహ్మచారియై వనమం దుండవలయునని మూలము.

120 ద్వాదశమాసికవ్రతంబు

సం. సోభ్యనుజ్ఞాయ రాజానాం వనచర్యాయదీక్షితః
వనేద్వాదశవర్షాణి వాసాయోను జగామహ.

122 తస్కరవధమున నశ్వమేధపుణ్యము.

తస్కరోపేక్షవలన శిశువధపాపమును అదృష్టమూలము. హృద్యమే

123 ఆజిజయా=యుద్ధమున గెలుపుగలవాఁడా? వ్యధి. బహు

133 ద్వాదశమాసికవ్రతము.

సం. బ్రహ్మచర్యమిదంభద్రే మమద్వాదశవార్షికమ్.

136 గోదానభూదానహిరణ్యదానమ్ము లాదిగాఁ బెక్కుదానంబులు
సేసి

గోభూహిరణ్యాదిదానమ్ములు పెక్కులు చేసి అనరాదా?

138 కళింగవిషయంబు సొచ్చునంతఁ దోడిబ్రాహ్మణులు కొందఱు
కళింగద్వారంబునఁ గ్రమ్మఱి యుత్తరకురుదేశమ్ములకుం జనిరి.
కతిపయబ్రాహ్మణసహితుం డై

సం. కళింగరాష్ట్రద్వారేషు బ్రాహ్మణాః పాండవానుగాః
అభ్యనుజ్ఞాయ కౌంతేయ ముపావర్తంత భారత
సతుతైరభ్యనుజ్ఞాతః కుంతీపుత్రోధనంజయః
సహాల్పై రల్పకైఃశూరః ప్రయయాయత్రసాగరః

స్మృతి. అంగవంగకళింగేషు సౌరాష్ట్రమగధేషుచ
తీర్థయాత్రాం వినాయాతి పునస్సంస్కారమర్హతి.

కళింగదేశమునకు గమనము విప్రునకుఁ బునరుపనయనహేతువు. తీర్థయాత్రాపథమునఁ బ్రాయశ్చిత్తము లేదు. పాండవానుగాః=అర్జును వెంబడించినవారు, తీర్థయాత్రికై వచ్చినవారు గారుగాన విప్రు లందఱు గళింగప్రవేశము మానిరి.-'కొందఱు' 'కతిపయ' అనుటకుఁ బ్రమాణము లేదు.

అర్థయతిప్రాసపాదసీసము.

సీ. దక్షిణగంగనాఁ దద్దయు నొప్పిన
గోదావరియు జగదాదిమైన
భీమేశ్వరంబును బెడఁ గగుచున్నశ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేగీదేశ
విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి

తే. గీ. ణాంబురాశితీరంబున కరిగి దురిత
హారి యైన కావేరీమహాసముద్ర
సంగమంబున భాను రేశ్వరుల కభిమ
తార్థదానంబుఁ జేసి కృతార్థుఁ డగుచు.

గోదావరీభీమేశ్వరశ్రీపర్వతివేఁగీదేశములు సంస్కృతమున నగృహీతములు, నన్నయ భట్టారకునిస్వదేశాభిమానమున నాంధ్రభారతము నలంకరించెనని సుప్రసిద్ధమె.

140 పదుమూఁడవమాసంబున

సం. సతథేతిప్రతిజ్ఞాయ తాంకన్యాం ప్రతిగృహ్యచ
ఉవాసనగరేతస్మిం స్త్రిసః కుంతీసుతస్సమాః.

144 ఈలతాంగికి నుంకువి ట్లీఁగనోపు దేని

ఉంకువ=శుల్కము. ఓలి, ఉంకువిట్లు, స్త్రీసమాకారసంధి.

146 అంగజరాజ్యలక్ష్మిప్రౌఢ యైనది.

పొడవు=రూపును, ఐనది=పొందినది.

148 వీనన్=ఈతీర్థములందు కోల్మొసలులు. కోలు=పెద్ద. 'క్రోలు' అనుట తప్పు.

161 విధికృతంబుఁ. గీ. గ్రమ్మఱింప లావె

లావు=అశక్యము.

నన్నయ సుభద్రావివాహఘట్టమును మూలవిరుద్ధముగాఁ గల్పించినాఁడు. కావున సంస్కృతాంధ్రములు రెండును గ్రిందఁ బ్రచురింతుము. భేద మరయునది.

165 మఱియు నప్పురంబున నన్యులు దన్నెఱుంగకుండనుండవలయు
ననియును యాదవులు యతుల కతిభక్తు లనియును మనంబునం
దలంచి కృతకయతివేషధరుండయి

'ఎఱుంగకుండవలయు' అన్నంజాలును. రెండుండ లక్కఱలేదు.

సం. ప్రభాసదేశం సంప్రాప్తం బీభత్సుమపరాజితమ్
సుపుణ్యాంరమణీయంచ శుశ్రావమధుసూదనః
తతోభ్యగచ్ఛత్కౌంతేయం సఖాయం తత్రమాధవః
సకృత్వావశ్యకార్యాణి వార్ష్ణేయేనాభినందితః
రథేనకాంచనాంకేన ద్వారకామభిజగ్మివాన్
అలంకృతాద్వారకాతు బభూవజనమేజయ
కుంతీపుత్రస్యపూజార్థ మపినిష్కుటకేష్వపి

సీ. అందుల కేగి యే నిందీవరశ్యాము
నరవిందనాభు నంబురుహనేత్రు
నన్మిత్రుఁ జూచి నాజన్మంబు సఫలంబు
సేయుదు నఘములువాయుఁబొంటె
నదియునుగాక ము న్గదుఁడనువానిచే
వింటేఁదిలోత్తమకంటె రూప
వతియటె సద్గుణాన్వితయటె నాకట్టి

భద్రేభగమనసుభద్రఁ జూచు
వేడుకయును గలదు విష్ణుభట్టారకు
దయ నభీష్టసిద్ధి దనరు ననియుఁ
దద్ద సంతసిల్లి తద్ద్వారకాపురి
కరుగ నిశ్చయించె నర్జునుండు.

171 పుష్పితవల్లివేల్లితోర్వీజవనావళిః
వల్లి. నదిసులగురుర్ణశకల్యఅనునట్లు దీర్ఘసమాసమున హ్రస్వమో

172 ఉ. ......రైవతకాచలకందరంబున
రాజకులైకసుందరుఁబురందరనందను నుంచెఁ బ్రీతితో
వాసుదేవుండు వాసవనందనునంద యుండం బనిచి కాంచన
రథారూఢుం డై పురంబునకుం జని

174 పూసి=గందమును, కట్టి=వలువలను, తొడి=నగలు దాల్చి.
'కాంస్యమృదంగకశంఖభేరికాహాళరవముల్
'మృదంగక' లోని 'క' పూరణము. భేరి, దీర్ఘసమాసమున హ్రస్వము.

180 బలదేవాదియాదవు లతిభక్తు లై వచ్చి యతియకా వగచి య
ర్జునునకు నమస్కరించి యాతనివలన సర్వతీర్థకీర్తనంబులును
దత్సేవాఫలంబులును విని సంతసిల్లి యివ్వర్షాకాలంబుననింద
యుండి చాతుర్మాస్యంబు సేసి మమ్ముం గృతార్థులం జేయుం
డని ప్రార్థించి యప్పార్థుం దోడ్కొని చని వానికి నన్నపానా
దివిధులం బరిచరింప సుభద్రం బంచి కన్యాంతఃపురంబునందు
నివాసంబు సేసిన

181 క. అందు ధృతిమందరుండు పు
రందరనందనుఁడు దనకు రమ్యగుణశ్రీ
సుందరి సుభద్ర నెయ్యం

బొందఁగఁ బరిచర్య సేయుచుండగ నుండెన్.

182 క. ధీరుఁడు యతిరూపంబున
నారఁగనిందున్నయాతఁ డర్జునుఁ డని స
త్యారుక్మిణులకుఁ జెప్పె ము
రారాతి రహస్యమున ననంతప్రీతిన్.

183 చ. అలయక నాటినాటికి లతాంగి యపూర్వము లైనభోజనం
బులు గడుభక్తిఁ బెట్టుచు నపూర్వము లై నవపుష్పలాసయు
క్తులు వెలయించుచు న్ముదముతోఁ బెనిచెన్మఱునాటినాటిక
గ్గలమగుచుండ నెయ్యమును గామవికారము సవ్యసాచికిన్.

' నాఁడునాఁటికి ' అనునది యుక్తపాఠము.

184 మఱియును
సీ. అళినీలకుంతలుం డనియును హరినీల
సమవర్ణుఁ డనియు నాజానులంబి
తాయతస్థిరబాహుఁ డనియును రక్తాంత
నళినదళాకారనయనుఁ డనియు
నుత్తుంగఘనవిశాలోరస్కుఁ డనియును
గవ్వడి యనియును గరము వేడ్క
విప్పచ్చు నెప్పుడు వినియుండునది దన
విని నట్ల యతిఁ జూచి వీఁడు విజయుఁ
ఆ. గీ. డొక్కొ-యనుచు సంశయోపేతచిత్తయై
యుండి యుండనోప కొక్కనాఁడు
భోజనావసానమున నున్నయమ్మౌని
కిట్టులనియెఁ బ్రీతినిందువదన.

ఆజానులంబితాయత పదమధ్యమున సీసపాదావసానము.

వ. మునీంద్రా మీయాడనితీర్థమ్ములును మీచూడనిపురంబులును మీమెఱుంగనిరాజులును లేరని విచారింతు

సీ. అమరావతికి నెనయనఁగ నివ్వసుమతిఁ
బరఁగునింద్రప్రస్థపురవరంబు
సూచితిరే పాండుసుతు లందు సుఖ
మున్నవారె మాయత్త యంభోరుహాక్షి
కుంతీమహాదేవి కుశలినియే మహావీరుఁ
డర్జునుఁడు జితారి తీర్థ
గమనోన్ముఖుం డయ్యెఁ గ్రిమ్మఱివచ్చెనే
యెఱుఁగుదురేని నా కెఱుఁగఁజెప్పఁ
డనిన నేన చూవె యయ్యర్జునుండ నీ
యొద్ద నివ్విధమున నున్నవాఁడఁ
దరుణి నీకు నాకు ధరణీధరుండను
జలజభవుఁడు సేసె సంగమంబు.

వ. బ్రాహ్మంబు మొదలుగాఁ గలయెనిమిదివివాహమ్ములయందును గాంధర్వరాక్షసమ్ములు క్షత్రియులకు నుత్తమవివాహమ్ములు గావున నిది గాంధర్వవివాహంబునకు సమయం బనిన సుభద్ర లజ్జావనతయయి యిట్లనియె.

తే. గీ. నన్ను నీ నర్హులెల్ల నిందున్నవారు
వార మెఱిఁగి చేయుదురు వివాహ మనుచు
వనజనేత్రి యంతఃపురంబునకుఁ జనియె
నరిగెఁ దనలతాగృహమున కర్జునుండు.

వ. అయ్యిరువురయన్యోన్యప్రణయమ్ములు దనదివ్యజ్ఞానంబున దివ్యపురుషుం డైనపురుషోత్తముం డెఱింగి యర్జునునకు భోజనవిధు

లానర్ప రుక్మిణీదేవిం బనిచి యొక్కనాఁడు దేవకీవసుదేవప్రద్యు
మ్నసాంబసంకర్షణసారణసాత్యకులకు నర్జునస్థితియును నాతని
యందు సుభద్రనెయ్యంబును నెఱింగించినఁ దమతొల్లింటివిచా
రంబున కనురూపం బగుటకు సంతసిల్లి బలదేవాఁడు లెఱుంగకుం
డ సుభద్రార్జునులవివాహంబు సేయనిశ్చయించి తమనిశ్చయం
బయ్యిరువురకుం జెప్పి పశుపతిపూజామహోత్సవవ్యాజంబున స
ఖలయాదవభోజాంధకవృష్ణినరులతో నంతర్ద్వీపంబునకుం జని.

క. అం దమరబృందవంద్యున
కిందుకళాభరణునకు నుమేశ్వరునకు నా
నందంబందఁగ నందఱ
నందకధరుఁ డుత్సవం బొనర్పఁగఁ బంచెన్.

క. తగఁగ వివాహం బెన్నం
డగునొకొ యెన్నండుసంగమావాప్తియు మా
కగునొకొ యని యెదఁ గోరుచు
నాగి నిటనుండిరి సుభద్రియును విజయుండున్.

క. హరిఁ దలఁచె సుభద్రపురం
దరుఁ దలఁచె ధనంజయుండు దడయక వార
ల్యిరువురఁ బెండిలిసేయఁగ
వరదులు తద్ద్వారవతికి వచ్చిరి ప్రీతిన్.

వ. ఇట్లు వాసుదేవుండు వసుదేవాక్రూరసారణసాంబసాత్యకిసహితుం
డై యంతర్ద్వీపంబుననుండి వచ్చినయనంతరంబ యమరావతినుం
డి యమరసిద్ధసాధ్యమునిగణపరివృతుం డై యమరేంద్రుండు
వచ్చె నంత బృహస్పతి నిశ్చయించినశుభలగ్నంబున నగ్నియమ
నిరృతివరుణవాయుధనదేశానాదిసురవరులు నత్రిభృగుభరద్వాజ

నారదవసిష్ఠవామదేవప్రభృతు లయినమహామునులును సదస్యు
లు గాఁ గశ్యపప్రజాపతి హోతగా నరుంధతియు సత్యభామయు
రుక్మిణియు నప్సరోగణంబులతోడం బురంధ్రీకార్యంబులు సేయ
సుభద్రార్జునవివాహం బతిరమ్యం బయ్యె నందు.

తరువాత, అనిమిషప్రభుఁడు నిజాత్మజు నలఘునర్జునుఁ బ్రీతితో నభి
[షిక్తుఁ జేసి
మనుజేశుఁ గాంచనమణిమయోత్తుంగ మకుటవిభూషణ
[మస్తకుఁ జేసి
యనుపమకేయూరహారాదిభూషణాభిశోభితుఁ జేసి యప్పు
[డానంద
జనితాంబుకణికార్ద్రచక్షుస్సహస్రజలరుహమ్ములఁ
[దాల్చె నమ్మద మెసఁగ.

మాలిని. నరునకు దయ నిట్లానందమొందించి యింద్రుం
డరిగె దివికి దివ్యానంతరత్నాంశుజాల
స్ఫురితసురవిమానమ్ముల్ నభోభాగ మెల్ల
న్నెరసి వెలుఁగుచుండ న్నిర్జరశ్రేణితోడన్.

వ. ఇట్లు నారాయణుండు నిజారంభంబు సఫలం బగుటకు సంతసిల్లి
సంప్రాప్తమనోరథుం డయినయప్పార్థుం గౌఁగిలించుకొని యక్ష
యబాణతూణీరబాణాసనసనాథంబై పవనజవమ్ము లైనహయ
మ్ములం బూన్చినకాంచనరథం బెక్కి సుభద్రం దోడ్కొని యిం
ద్రప్రస్థపురంబున కరుగుమని పంచి యనంతరంబ జనార్దనుం
డంతర్ద్వీపంబున కరిగిన.

క. హరి పంచినమార్గంబునఁ
గురువిభుఁడు సుభద్రఁ దోడుకొని చను నెడఁ

దత్పురపరిరక్షకు లతిభీ
కరులు పృథుశ్రవసుఁ డాదిగాఁ గలవీరుల్.

ఉ. వీరుఁడు వీఁడు పాండవుఁడు వృష్ణికులోత్తము లైనసీరిదై
త్యారి వెఱుంగకుండఁగ మహారథుఁ డై తరుణి న్సుభద్ర నం
భోరుహనేత్రఁ దోడ్కొనుచుఁ బోయెదు నీతనిఁ బోవనిచ్చిన
సీరుఁడు మాధవుండు బలదేవుఁడు నల్గుదు రంచు నడ్డమై.

క. వీఁకఁ బఱతెంచి నల్గడఁ
దాఁకినఁ గడునల్గి ఘోరతరశరహతి న
మ్మూఁకలు విరియఁగ నర్జునుఁ
డాఁకగొనక యేసె నుగ్రుఁడై రణభూమిన్.

చ. హరితనయుండు పార్థుఁడు రయంబున నందఱ నాహవక్రియా
విరహులఁ జేసి యప్పురమువీథుల వేదుల రమ్యహర్మ్యగో
పురములఁ దద్గిరీంద్రమణిభూముల భూరితటాకపంకజా
కరనవనందనావళులఁ గాండమయమ్ములఁ జేసె నీసునన్.

క. అమరేంద్రసుతుఁడు దనకుం
గమలాక్షి సుభద్రరథముగడపఁగ ననిలో
నమితయదుసైన్యముల న
శ్రమమున నోడించి లబ్ధజయుఁ డయి యరిగెన్.

సం. దిదృక్షవస్తశ్చకౌంతేయం ద్వారకావాసినో జనాః
నరేంద్రమార్గమాజగ్ముస్తూర్ణంశతసహస్రశః
కృష్ణస్యభవనేరమ్యే రత్నభోజ్యసమావృతే
ఉవాససహకృష్ణేనబహులాస్తత్రశర్వరీః
తతఃకతిపయాహస్యతస్మిన్రైవతకేగిరౌ
వృష్ణ్యంధకానామభవదుత్సవోనృపసత్తమ

చిత్రకౌతూహలే తస్మి న్వర్తమానే మహోద్భుతే
వాసుదేవ శ్చ పార్థ శ్చ సహితౌ పరిజగ్మతుః
తత్ర చంక్రమమాణౌ తౌ వసుదేవసుతాం శుభామ్
స్వలంకృతాం సఖీమధ్యే సుభద్రాం దదృశు స్తదా
దృష్ట్వైవ తా మర్జునస్య కందర్ప స్సమజాయత
తం త థైకాగ్రమనసం కృష్ణః పార్థ మలక్షయత్
అబ్రవీ త్పురుషవ్యాఘ్రః ప్రహస న్నివ భారత
వనేచరస్య కి మిదం కామే నాలోడ్యతే మనః
మ మైషా భగినీ పార్థ సారణస్య సహోదరా
సుభద్రానామ భద్రం తే పితు ర్మే దయితా సుతా
యది తే వర్తతే బుద్ధి ర్వక్ష్యామి పితరం స్వయమ్

అర్జునఉవాచ. దుహితా వసుదేవస్య వాసుదేవస్య చ స్వసా
రూపేణ చైషా సంపన్నా క మివైషాన మోహయేత్
కృత మేవ తు కల్యాణం సర్వం మమ భవేద్ధ్రువమ్
యది స్యా న్మమ వార్ష్ణేయీ మహిషీయం స్వసా తవ
ప్రాప్తౌతుక ఉపాయ స్స్యా త్తం బ్రవీహి జనార్దన
ఆఖ్యాస్యామి తదా సర్వం యది శక్యం నరేణ తత్

వాసుదేవఉవాచ. స్వయంవరః క్షత్రియాణాం వివాహః పురుషర్షభ
స చ సంశయితః పార్థ స్వభావ స్యానిమిత్తతః
ప్రసహ్య హరణం చాపి క్షత్రియాణాం ప్రశస్యతే
వివాహహేతు శ్శూరాణా మితి ధర్మవిదో విదుః
స త్వ మర్జున కళ్యాణీం ప్రసహ్య భగినీం మమ
హర స్వయంవరే హ్యస్యాః కో వై వేద చికీర్షితమ్
త తోఽర్జున శ్చ కృష్ణ శ్చ వినిశ్చి త్యేతి కృత్యతాం

శీఘ్రగా న్పురుషా స న్యా న్ప్రేషయామాసతు స్తదా
ధర్మరాజాయ త త్సర్వ మింద్రప్రస్థగతాయ వై
శ్రుత్వైవ చ మహాబాహు రనుజజ్ఞే స పాండవః
తత స్సంవాదితే తస్మి న్ననుజ్ఞాతో ధనంజయః
గతాం రైవతకే కన్యాం విదిత్వా జనమేజయ
రథేన కాంచనాంగేన కల్పితేన యథావిధి
శైబ్యసుగ్రీవయు క్తేన కింకిణీజాలమాలినా
మృగయా వ్యపదేశేన ప్రయయౌ పురుషర్షభః
సుభద్రా త్వథ శైలేంద్ర మభ్య ర్చ్యైవహి రైవతమ్
ప్రదక్షిణం గిరేః కృత్వా ప్రయయౌ ద్వారకాం ప్రతి
తా మభిద్రుత్య కౌంతేయః ప్రసహ్యారోపయ ద్రథమ్
రథేన కాంచనాంగేన ప్రయయౌ స్వపురం ప్రతి

కృ॥ స చ నామ రథ స్తాదృ జ్మదీయా స్తే చ వాజినః
యోద్ధా పార్థ శ్చ శీఘ్రాస్త్రః కో నుతేనసమోభవేత్
త చ్ఛ్రుత్వా వాసుదేవస్య తథా చక్రు ర్జనాధిప
నివృత్త శ్చార్జున స్తత్ర వివాహం కృతవా న్ప్రభుః
ఉషిత్వా తత్ర కౌన్తేయ స్సంవత్సరపరాః క్షపాః
పూర్ణే తు ద్వాదశే వర్షే ఖాండవప్రస్థ మాగతః

అర్జునుఁడు, దలంప నెఱింగి ప్రభాసమునకు వచ్చినకృష్ణునితో రైవతకమున విహరించి యప్రచ్ఛన్నుఁ డై ద్వారకం జొచ్చి కృష్ణసన్నిధి రైవతకోత్సవంబున సుభద్రం గాంచి వలచి వనవాసవ్రతి కామవశుఁడు గా నుచితమేయని పరిహసింపఁబడి రాక్షస వివాహమ్మునఁ గృష్ణరథ మెక్కించి సుభద్రతో నింద్రప్రస్థపురాభిముఖుఁడై పోయి న బలరామాదుల వారించి శ్రీకృష్ణుం డర్జును రావించి ద్వారకయందు వివాహము గావించె. నిట్లు సంస్కృతమున సుభద్రార్జునులవివాహము రాక్షసము.

తెనుఁగునందో కృష్ణుఁ డర్జును రైవతకమున యతివేషు నునిచి తెలిపి బలరామాదులచే

ప్రేముకించి సుభద్రయింట నిలిపి రుక్మిణీసత్యభామలకుఁ దెలిపి, లక్షణముల నర్జునుం డని సంశయించి యడిగిన, నే నర్జునుండ నని తనవలపు ప్రకటించిన, సుభద్రను బలరామాదులతో నంతర్ద్వీపమున కరిగి సుభద్రాపిస్మృతుం డై రాత్రి వచ్చి యర్జునస్మృతి సకలమునివృతుఁ డై విచ్చేసినమహేంద్రుతో విజయునకు వివాహముఁ జేసెను. ఇది గాంధర్వవివాహము. పురరక్షకు లడ్డగింప నందఱఁ దఱిమి ద్వారక బాణమయము గావించి సుభద్రరథము నడఁప నింద్రప్రస్థమున కరిగె.

217 శ్రీనుతు లొప్ప నుత్సవము సేసిరి సప్తదినంబు

సం॥ ఏవముత్తమవీర్యాస్తే విహృత్యదివసాన్బహూన్
పూజితాః కురుభిర్జగ్ముః పునర్ద్వారవతీంప్రతి.

221 రమ్యభూష। ణాలంకృతస్త్రీసహస్రంబు

పదమధ్యమునఁ బాదావసానము.

231 సితేతరగతితీవ్రతిగ్మకరధామసహాసమునన్

సిత + ఇతర=అసిత=కృష్ణవర్త్మ, అగ్నివలెఁ బ్రచండమైనవేఁడివేల్పుకిరణములవేయిచే

243 ఘృతసంపూర్ణదక్షిణానేకాధ్వరమ్ములు

సంపూర్ణఘృతదక్షిణానేకాధ్వరమ్ములు=అనవలయు. వెలితి లేనియాజకాదిదేయద్రవ్యము గలపెక్కుజన్నములు

248 ఈవ్యాధి యొంటఁ దీఱదు=ఖాండవదాహాన్యమున నీ తెవులు నశింపదు.

249 ఘనాఘనములు=వర్షించుమబ్బులు

250 తద్వచనానుమార్గంబున=బ్రహ్మపలుకు ననుసరించినదారిని

251 ఈమహాకార్యంబు తొడఁగకున్నవార మెడయుఁ జేసి—

ఎడయుఁ జేసి=ఆలసించి, "యు" వాక్యాలంకారము.

254 సింహలాంగూలకపిధ్వజవిరాజమానంబై—

తపనీయా సురుచిరాధ్వజయష్టి రనుత్తమా
తస్యాంతు వానరో దివ్య స్సింహశార్దూల కేతనః

259 పెడిలిసువర్ణపర్వతము పెక్కుదెఱంగుల వ్రయ్యనట్టు ల। ప్పుడు

పెడులు=కాలి ధ్వనితోఁ బ్రద్దలవు. రూ. పెటులు. పెట్లు

సం. దహత స్తస్య చ బభౌ రూపం దావస్య భారత
మేరోరివ నగేంద్రస్య కీర్ణస్యాంశుమతోంశుభిః.

267 అలుగులపడి ఖాండవమునఁ। గల
అలుగులముపడు=బాధనొందు.

270 ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు। వఱలఁగ=క్రిమ్మఁగా

271 ఖాండవమునకు గృహంబా
ఖండలుధారలకుఁదూఱఁ గాకుండంగన్.
గృహంబు=కప్పు, ఆవరణము.

272 తక్షకతనయుఁ డశ్వ
సేనుఁ డనుపన్నగుం డగ్నిశిఖల కపుడు

273 వెఱచి తల్లిఁ దోఁకఁ గఱపించుకొని దివిఁ
బఱచువానిఁ జూచి.
తల్లిచే అని తృతీయయు నగు.

274 వెండియు నశ్వసేను నేయసమకట్టిన యప్పార్థునకుఁ దక్షణంబ
మోహిని యనుమాయ గావించి
సం. తస్యా శ్శరేణ తీక్ష్ణేన పృథుధారేణ పాండవః
శిర శ్చిచ్ఛేద గచ్ఛన్త్యా స్తామపశ్య చ్ఛచీపతిః
తాం ముమోచయిషు ర్వజ్రీవాతవర్షేణ పాండవం
మోహయామాస తత్కాలమశ్వసేన స్త్వముచ్యత
తాంచ మాయాం తదాదృష్ట్వాఘోరాంనాగేనవంచితః
ద్విధా త్రిధాచ ఖగతా న్ప్రాణినః పాండవో చ్ఛినత్

281 తృప్తిగాక అనుధాతువు ప్రాప్త్యర్థకము. పొందక=తనియక

289 నముచియనుదనుజు ననుజుండు
సం. నముచేర్భ్రాతరం మయమ్.
నముచిసూదనః=ఇంద్రనామము. దేవాసురయుద్ధమున నన్ను నచ్చెనని నన్నుయయూహించెనో.

293 క. మయభుజగమోక్షణమునిర్ణయముగ నెఱిఁగితి—

మయునివిడుపు, అశ్వసేనువిడుపును.

సం. తథాసురం మయం నామ తక్షకస్యనివేశనాత్
విప్రద్రవంతం సహసా దదర్శ మధుసూదనః
తమగ్నిః ప్రార్థయామాస దిధక్షు ర్వాతసారధిః
శరీరవా న్జటీ భూత్వా నదన్నివ బలాహకః
జిఘాంసు ర్వాసుదేవ స్తం చక్ర ముద్యమ్య ధిష్ఠితః
సచక్ర ముద్యతం దృష్ట్వా దిధక్షు న్తంచ పావకమ్
అభిధా వార్జునే త్యేవం మయ స్త్రాహీతి చాబ్రవీత్
తస్య భీతస్వనం శ్రుత్వా మాభై రితి ధనంజయః
ప్రత్యువాచ మయం పార్థో జీవయన్నివ భారత
తం నభేతవ్య మిత్యాహ మయం పార్థో ధనుర్ధరః
తం పార్థే నాభయే దత్తే నముచేర్భ్రాతరం మయమ్
నహంతు మైచ్ఛ ద్దాశార్హః పావకో నదదాహచ.

299 జరితయనులావుక వివాహంబై—

లావుక. వై. శార్ఙ్గర్థమా?

సం. శార్ఙ్గికాం శార్ఙ్గకో భూత్వా జరితాం సముపేయివాౝ.

300 క. నీ వఖలధర్మమూర్తి వి
నావీర్యప్రభవులైన నలువురుసుతులౝ
లావుకలఁ గరుణఁ గావుము
పావక భువనోపకారపర్యాప్తమతీ.

మద్వీర్యప్రభవులు. అనునట్లు నావీర్యప్రభవులనియె. సమాసము వింత. అమితబల భేది యొక్కరుఁడ యమ్మిగాన్వేషణ శ్రమాకులితచిత్తుఁడై, ఇత్యాదులయట్టిది.

302 క. తరుణుల నజాతపక్షుల

ననలశిఖాభీతిచంచలాత్మల నెటయుం
జననేరనిబాలకులను
జనని నిరీక్షించి శోకసంతాపితయై.

తరుణుల=యువార్ధకము.ఇచట బాలురను అనిభావమో ఏల? "చననేరనిబాలకులను" ఈపదముచే బునరుక్తము. "ఎటయుంజన" ఎటనుం జన అనిగాని ఎటకుం జన అని యుండె దిద్దవలయు.

303 క. వీరలఁ దోడ్కొనిపోవఁగ
నేరను బాలకులఁ బెట్టి నిర్దయబుద్ధి
న్వీరలతండ్రికిప్రియం జన
నేరను విధికృతము గడవనేరఁగలావే.

పూర్వపాపమున నొదవినదుఃఖము దాఁటనేర్చుటకు. లావు=శక్తి ఉన్నది ఏ? ఉన్నదా? లేదు.

305 ఎటయేని నేగి—

"ఎటకేని" ఎటనేని యని దిద్దిన స్పష్టము. ఒండేని కాలాధ్వములకుం బాయికంబుగఁ బ్రిథమయగు. సూ.ఎట ప్రథమ

310 మేము దహనక్లేశంబునం బొందిన—

న. వర్జ్యము.

313 తరుణుల నజాతపక్షులఁ
జరణంబులులేనివారిశార్ఙ్గేయుల

సం. ఇమేచ మాం కర్శయంతి శిశవో మందచేతసః
అనర్హా శ్చరణై ర్హీనాః పూర్వేషాం నః పరాయణాః

318 గోపతి=స్వర్గనాథుఁడు.

319 అనఘులు నరనారాయణు
లనాదియుగంబున నున్నతాసురసుతుల
య్యును నపుడు మనుజులగుట

న్విసయంబున మొ్రిక్కి రమరవిభునకుఁ బ్రీతిన్.

ఇది యమకాలంకము. ఆంధ్రకవి యుక్త్యౌచిత్యవిజ్ఞానము.

320 ఇంద్రుండు కృష్ణార్జునుల నతిస్నేహంబునఁ (గౌఁగలించుకొని)
(యర్జునునకు నాగ్నేయవారుణవాయవ్యాదిదివ్యబాణంబులిచ్చి)
యాతనికి నీవెప్పుడు ప్రియసఖుండవై యుండుమని (కృష్ణుం
బ్రార్థించి) దివంబున కరిగె

శ్లో. తతోఽంతరిక్షా ద్భగవా నవతీర్య పురందరః
మరుద్గణై ర్వృతగ పార్థం కేశవం చేద మబ్రవీత్
కృతం యువాభ్యాం కర్మేద మమరై రపి దుష్కరమ్
వరం వృణీతం తుష్టోస్మి దుర్లభం పురుషే ష్విహ
పార్థస్తు వరయామాస శక్రా దస్త్రాణి సర్వశః
ప్రదాతుం తచ్చ శక్రస్తు కాలం చక్రే మహాద్యుతిః
యదా ప్రసన్నో భగవా న్మహాదేవో భవిష్యతి
తదా తుభ్యం ప్రదాస్యామి పాండవాస్త్రాణి సర్వశః
వాసుదేవోఽపి జగ్రాహ ప్రీతిం పార్థేన శాశ్వతీమ్
దదౌ సురపతిశ్చైవ వరం కృష్ణాయ ధీమతే.

320 ఇటవాసుదేవార్జునులు మయుం దోడ్కొని మరలియింద్రప్రస్థ
పురంబునకు వచ్చి ధర్మరాజునకు మొ్రిక్కి ఖాండవదహనప్ర
కారంబు సెప్పి మయుం జూపి సుఖంబుండిరని.

321 క. జనమేజయజనపాలున
కనఘచరిత్రునకుఁ బ్రీతుఁడయి వైశంపా
యనుఁ డాదిపర్వకథ లె
ల్లను నిమ్ముగఁ జెప్పె నని విలాసమహేంద్రా.

సం. ఏవం తౌ సమనుజ్ఞాతౌ పావకేన మహాత్మనా
అర్జునో వాసుదేవశ్చ దానవశ్చ మయ స్తథా
పరిక్రమ్య తతస్సర్వే త్రయోపి భరతర్షభ
రమణీయే నదీకూలె సహితాస్సముపావిశన్

జనమేజయునకు వైశంపాయనుఁ డాదిపర్వకథ లెల్ల నిట్లు వినిచె నని (యుగ్రశ్రవుఁడు శౌనకాదులకుఁ జెప్పె నని వాక్యశేషము.)



| | | చందాదార్లకు. | ఇతరులకు. |
|---|---|---|---|
| 22. | అట్టహాసము | 0-2-6 | 0-4-0 |
| 23. | సువృత్తతిలకము | 0-2-6 | 0-4-0 |
| 24. | జార్జిపట్టాభిషేకచరిత్రము | 0-1-0 | 0-1-6 |
| 25. | కాత్యాయనచరిత్రము | 0-1-6 | 0-2-6 |
| 26. | అప్రస్తుతప్రశంస | 0-2-0 | 0-3-6 |
| 27. | ఇందిరాదేవి (నవల) | 0-2-6 | 0-4-0 |
| 28. | పరాస్తపాశుపతము | 0-1-6 | 0-2-0 |
| | ఇతరులవి. | | |
| 29. | ప్రబోధచంద్రోదయము | 0-6-0 | 0-8-0 |
| 30. | పరాశరస్మృతి | 0-3-6 | 0-5-0 |
| 31. | గంగాలహరి | 0-0-6 | 0-1-0 |
| 32. | చంపూభారతము | 0-12-0 | 1-0-0 |
| 33. | సర్వేశ్వరశతకము | 0-1-0 | 0-1-6 |
| 34. | ఉదయలక్ష | 0-6-0 | 0-8-0 |
| 35. | భారతఫక్కి I. | 0-6-0 | 0-8-0 |
| 36. | యోగము—పరోక్షము, అపరోక్షము | 0-1-6 | 0-2-6 |
| | ప్రాచీనగ్రంథములు. | | |
| 37. | మత్స్యపురాణము | 0-9-6 | 0-14-0 |
| 38. | పరమయోగివిలాసము | 1-0-0 | 1-4-0 |
| 39. | మైరావణచరిత్రము | 0-8-0 | 0-10-0 |

అచ్చులోనున్నవి.

40. శ్రీరామకృష్ణమహాభారతము.
41. దమయంతీకల్యాణము.
42. ఔచిత్యవిచారచర్చ.
43. అధ్యాత్మరామాయణము.
44. సుభద్ర. (నవల)

పైపుస్తకములు కావలయువారును, చందాదారులుగ నుండఁ గోరువారు నీదిగువ చిరునామాకు వ్రాయవలెను.

మానేజరు, కవిత, పిఠాపురము.

# శ్రీ వేంకటరామకృష్ణ గ్రంథమాల.

| | | చందాదార్లకు. | ఇతరు[illegible] |
|---|---|---|---|
| | **ప్రథమగుచ్ఛకము.** | | |
| 1. | శ్రీరాజానురంజనము | | |
| 2. | అత్యద్భుతశతావధానము | | |
| 3. | ప్రహ్లాదవంశము | | |
| 4. | పుష్పబాణవిలాసము | 0-5-0 | 0-8[illegible] |
| 5. | రామాయణము(శతవిధానము) | | |
| 6. | శతావధానము | | |
| 7. | ఏనాముశతావధానము—అష్టావధానములును. | | |
| | **ద్వితీయగుచ్ఛకము.** | | |
| 8. | కోకిలకాకము | | |
| 9. | కవితావిమర్శనఖండనము—ముండనమండనము | | |
| 10. | శతప్రాసము | 0-5-6 | 0-8-[illegible] |
| 11. | శతఘ్ని (విమర్శము) | | |
| 12. | శృంగభంగము | | |
| 13. | సత్యసందేశము. | | |
| | **తృతీయగుచ్ఛకము.** | | |
| 14 | గగనపుష్పము | | |
| 15 | తిరుపతివేంకటేశ్వరార్ధశతకము | 0-6-0 | 0-8-0 |
| 16 | కవికంఠాభరణము | | |
| 17 | కౌరవగౌరవము. | | |
| 13 | వ్యాసాభ్యుదయము | 0-2-6 | 0-4-0 |
| 19 | మదాలస | 0-4-6 | 0-7-0 |
| 20 | ఉత్తరరామచరిత్రము 1 వభాగము. | 0-4-0 | 0-6-0 |
| 21 | భోజరాజచరిత్రము 1 వభాగము. | 0-2-6 | 0-4-0 |

తిప్పిచూడుడు.